790 790

Reg. No. 757

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జనపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
ప్రకటింపఁబడుచున్నది.
గుంటూరు.

సంపుటము 32 { 1940 సం॥ మే నెల } సంచిక 2

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణీ ఆదిలక్ష్మీదేవమ్మ బహాదరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకరభారతీస్వాముల
హంపి.

౨ శ్రీశ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యానృసింహభారతీ
స్వాములవారు, పుష్పగిరి.

౩ తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

౪ ఆర్. రామారెడ్డిగారు, దైవమదిన్నె.

౫ రాజా సురభి వెంకటరత్నాంబ బహాదరుగారు,
రాణీ, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము.

౬ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౭ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౮ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

## పోషకులు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు
జమీందారుగారు - వేమిడి.

౩ రాయప్రోలు రాఘవదీక్షితులుగారు, పోలీసు సర్కిలినస్పెక్టరు,
గూడూరు.

౪ కొండ్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బసవాపురము.

౫ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇసునూరు.

# అభినవసరస్వతి

| సంపుటము ౩౨ | విక్రమ నామసంవత్సరము వైశాఖమాసము | సంచిక ౨ |
| --- | --- | --- |


## కృతి విమర్శనము

ఆంధ్రి—

ఇది యొకమాసపత్త్రిక. సంపాదకులు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు. దీని 2 వ సంపుటము 1 వ సంచిక (చైత్రి ఏప్రియల్) మాసపుది మాకార్యస్థానమలంకరించినది. ఈనెలలో విక్రమారంభాది వివిధవిషయములు ప్రకటీకృతములు. విక్రమారంభమున నోలేటి వెంకటరామశాస్త్రిగారు పానుగంటి నరసింహారావుగారు గిడుగు రామమూర్తిగారు మున్నగు నెన్నికగన్న విద్వత్కవులు చన్నందులకు సంతాపము సూచించినను నాంధ్రి మరల నాంధ్రభోజ సాహిత్యవిశారదాదుల వ్యాసరచయితలఁగాఁ బడసినందుల కానందము వ్యక్తముచేసినది. ఆంధ్రభోజాదులే యనేకులు వ్యాసరచయితలగుట నాంధ్రి భాషావ్యాపనమే ప్రధానకార్యముగాఁ బెట్టుకొని బయలువెడలుట కభినవసరస్వతి యభినందించుచున్నది. విద్వన్మనోరంజన మొనరించుట కాంధ్రి విక్రమించునఁట కాని సాహిత్యవిశారదాదుల వ్యాసములఁ బ్రకటించుట యందులకుఁ జాలదో? ఏకా దండయ్యపంతులుగారి నెన్నియున్న జాషువకవి పద్యములచే నీచైత్రమాసపత్త్రిక సమలంకృత. అందు

తే. గీ. కృతులుగల్పించు వలపుకీరితి కతాన
ఇటుల మీతల నెఱసిపోయినది గాని
సుకవితా నిపాసులకు వార్ధకము లేదు
యౌవనుఁడవీవు తలఁప దండయమనీషి!

అనుపద్యమొకటి. దీనిపై 'యౌవనుఁడనునది విచార్యము, యువయని గాని యువకుఁడని గాని యుండవలయు'నని సంపాదకులు స్వాభిప్రాయ మొసఁగియున్నవారు. అట్లే యాయా వ్యాసములపై నభిప్రాయమును వ్యక్తముచేయుచుందురు. దీనినిబట్టి వీరి భాషాజ్ఞానము విమర్శకతాశక్తి విదితమయ్యెడిని. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులుగారును నోలేటి వెంకటరామశాస్త్రిగారును గురుశిష్యులగుట యెఱుఁగుదును నేనని, ఆకొండి రామమూర్తిశాస్త్రిగారీయాంధ్రీ చైత్రపత్త్రికలో నభిప్రాయ మిచ్చియున్నారు. ఆయ్యది యథార్థమైయుండుననియే తలంపవలసియున్నదని సంపాదకులు సమ్మతించిరి. వీరా వెంకటరామశాస్త్రిగారి శిష్యులేయఁట. ఇట్టి జగత్ప్రసిద్ధులైన వెంకటశాస్త్రులుగారి శిష్యపరంపరనుండియే ప్రచురింపఁబడు నాంధ్రి యన్వర్థమార్గవర్తినియై యశస్సు నార్జించుట కభినవసరస్వతి యభిలషించుచున్నయది. దీని సాలుచందా రు 1-0-0, కాకినాడతాలూకాలోని పల్లెపాలెము కార్యస్థానము.

## వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు

ఆంధ్రభాషలో నక్షరాలతరగతిచదువు పిల్లవానిదగ్గఱనుంచి హైకోర్టుజడ్జివఱకును సంస్కృతమున శబ్దమంజరి చేతఁబట్టిన పిల్లనిదగ్గఱనుంచి శాస్త్రపారంగతులవఱకును శాస్త్రులుగారు స్మరణకురాని జను లుండరనుట స్వభావోక్తి. కనుకఁ గడచినసన్మానసంఘమువా రొసంగిన భాషోద్ధారకబిరుదము ప్రశంసాపాత్రము. అఖిలాంధ్రజగజ్జేగీయమానులగు నట్టి భాషాపోషకుని గూర్చి యభినవసరస్వతికూడ నభినందనము తెలుపకుండుట యపచారమగునని యారబ్ధముగాని యియ్యది యాశాంతవిశ్రాంతమైన యవ్వారియశశ్చంద్రికం గాని దేశోపకారమునఁగాని కలిగియున్న యత్కించిన్న్యూనత నపనయించుటకుఁ గాదు. రోళ్ల రోకళ్లఁ బాడఁబడు తచ్చరిత్ర కల్పిష్ఠమగు నస్మదభినందనమపహాస్యభాజనముఁ జర్వితచర్వణము నగునని చాలకాలము సంశయించియు నపచారభీతి నణుమాత్ర మభిప్రాయము వ్యక్తీకరింపవలసివచ్చినది. ఇప్పటికి సుమారు నూఱువత్సరములనాఁడు రామస్వామిశాస్త్రులుగారు ప్రారంభించిన భాషాపోషణమును వీరి కుమారులైన యీవెంకటేశ్వరశాస్త్రిగారు విపులముచేసి విశ్వవిఖ్యాతులయియు వావిళ్ల రామస్వామిశాస్త్రులు, అండ్ సన్సు, అనియే వ్యాపారము సాగించుచుఁ గనఁబఱచుచున్న పితృభక్తి కృతజ్ఞతలే వారి ధర్మబద్ధతకు వలసినంత సాక్ష్యము. ధర్మో రక్షతి రక్షితయను తజ్జ్ఞోక్తి ప్రకారము తద్ధర్మనిష్ఠతయే తద్వ్యాపారాభివృద్ధికిని సంపన్నగృహస్థతకును దగినంతసహకారము. మదరాసువంటి మహాపట్టణములో సంపన్నగృహస్థత సంపాదించుటన సామాన్యముకాదు. అద్దాని కహరహము నెంతయో వ్యాపారము సాగుచుండవలె. దేశదేశజనులును దినదినమును దెప్పించు శతాధికగ్రంథములే శాస్త్రిగారి వ్యాపారసర్వోత్కృష్టతను జాటఁగలిగెడిని. శాస్త్రిగారు స్వయముగా ముద్రింపించి సకలాంధ్రులకును సహస్రసంఖ్యల గ్రంథముల సరఫరాచేయుటయే కాక బహుజనపఠనీయఫక్కిం బ్రచురింపఁబడు పండితకవుల గ్రంథవిక్రయమునకును బాసటయగుచున్నారు. ఇయ్యదియు నితరపుస్తకవిక్రేతల పేరులకంటె నివ్వారిపేరునకే యిలాతలమున నెక్కువవ్యాప్తి కలిగియుండుట యెఱుఁగఁజేసెడిని. కనుకనే యాంధ్రదేశపుస్తకవ్యాపారులలో కెల్ల నగ్రస్థాన మలంకరించి భాషోద్ధారకబిరుదమును ఫలవంతము చేయు వెంకటేశ్వరశాస్త్రిగారి విస్తృతకీర్తిలో వేవంతుగూడ వీఁడు విలిఖింపలేఁడనుట విశేషోక్తి కాదు. వెంకటేశ్వరశాస్త్రిగారు కేవలవిక్రీతగ్రంథముల చేతనే బహ్వాంధ్రభవనములఁ బరిపూరించుటలేదు. ప్రతిఫలగ్రహణరహితముగం బంపిన గ్రంథములచేఁగూడ ననేకగ్రంథభాండాగారముల నలంకరించుచున్నవారు. ఒక్కపుస్తకభాండాగారములకే కాదు. విద్వాంసులకు విద్యార్థులకుఁ గవులకు, వేయేల, దేహీయనఁగలవానికెల్ల నాస్తియనుమాట లేకుండఁ బుస్తకములను బుచ్చుచున్నారు. ఆత్మీయగ్రంథముద్రణమునకుఁగూడ యాచించు నయ్యలును గొంద ఱుందురనుటకు సందియములేదు. అప్పుడపు డవ్వారియాశాపూరణముగూడ నాచరించుచుందురు. స్వీయవారపత్రికయగు త్రిలింగనుగూడఁ జందా యడుగకుండ నెందఱికో పంపుచున్నారు. పలుపత్రికలకు బదులుపంపుటయే కాక పోషకులో సహాయులో తుదకుఁ జందాదారులో యై సత్కరించుచున్నారు. చాలపత్రికలు సనాతనధర్మవిముఖములై స్వవ్యాసములకుఁ దావీయ

మిని సంతపించు సనాతనుల వ్యాసములను స్వపత్రికలోఁ బ్రకటించుచున్నారు. వీరు చేయు నుపకార మిట్టొక్క భాషావిషయముననే కాక బహువిషయములను బరికింపఁ బడుచున్నది. మదరాసున సమ్మానితులై పోవు మహాపండితులలో వీరి నూఱాలు గొననివారు వేఱు నుండరు. భాషాపోషణమే కాక పండితసత్కారముగూడ వీరికిఁ బ్రధానకార్యమే యైయున్నది. ఇట్టిమహోపకారికి భాషోద్ధారకబిరుద మొక్కటే పర్యాప్తము కాఁజాలదు. అర్థికల్పకాంధ్రదేశమహోపకార్యాద్యనేకబిరుదములుగూడ నర్హములని యభినవసరస్వతి యభిప్రాయము.

---

## సంస్కృతవాఙ్మయము

(కురుగంటి సీతారామయ్య యెమ్ యే గారు, ప్రొఫెసరు, నైజాంకాలేజి.)

అపౌరుషేయములని బ్రాహ్మణులచేఁ గొనియాడఁబడుచుఁ బ్రపంచమునందెల్లఁ బ్రథమగ్రంథమని పాశ్చాత్య విజ్ఞానవేత్తలచేఁ బ్రశంసింపఁబడుచున్న ఋగ్వేదము ప్రపంచముయొక్క కన్నులఁ దెఱచెను. ఋగ్వేదము చారిత్రికదృష్టితోఁ బఠింపఁబడిన దాదిగా భారతదేశమునకుఁ బశ్చిమముననుండిన భూములలో నైర్లండువఱకుఁ బ్రచారముననున్న యన్నిభాషలకును సంబంధమున్నట్లు భాషాతత్త్వవేత్తలకుఁ బొడకట్టెను. అనేకవిషయములఁ బాశ్చాత్యులకు మార్గదర్శకమైన భారతదేశము భాషాశాస్త్రమునఁ గూడ మార్గదర్శకమయ్యెను. ... పరిశోధకు లందఱును నార్యులను నొకజాతివా రెచ్చటనుండియో పశ్చిమద్వారము ద్వారమున భారతదేశమునఁ బ్రవేశించి పంచనద ... మును నివాసముగా నేర్పఱచుకొని ... రనియు ఋగ్వేదము వారి నాగరికత తెలియఁజేయు చారిత్రికప్రాముఖ్యముగు గ్రంథమనియు ... నమ్ముచున్నారు. ఈ యార్యుల ప్రథమనివాస మెద్దియని ... భిన్నాభిప్రాయములతో నున్నారు. ఈ భూమిని గొంపోయి పాశ్చాత్యులు యూరపుఖండమున నుంచుచున్నారు. ప్రాచ్య పండితులు ... తత్ప్రదేశము నాసియాఖండములో మధ్యనో యుత్తరముననో యుంచుచున్నారు. తిలకుమహాశయుఁడు జ్యోతిషసాక్ష్యమును బట్టి తత్ప్రదేశ ముత్తరకురుభూముల ... వద్దనని యభిప్రాయపడినాఁడు ... ఈయార్యుల భాష గీర్వాణమని కాని దేవభాషయనికాని పిలువఁబడుచున్నది. గీర్వాణమని వేదం వెంకటాచలయ్య గారును దేవభాషయని కాశీ కృష్ణాచార్యులు గారును చెప్పుచున్నారు. శ్రీయాచార్యులు గారు దేవదేశమని యొకదేశమున్నదనియు నచ్చటి భాష దేవభాషయనియు నదియే యిప్పుడు సంస్కృతమని వాడఁబడుచున్నదనియు సహేతుకముగా వాదించుచున్నారు. ... క్రమముగా భాషకు వ్యాకరణ మేర్పడెను. ప్రథమమున రామాయణాది పురాణములును దరువాతఁ గ్రమముగా వాఙ్మయ మంతయును బెరిగెను. రామాయణకాలము నాఁటికే రాజ్యాంగమును వర్ణాశ్రమధర్మనిర్వహణమును నవిచ్ఛిన్నముగా నడచుచున్నట్లు కచ్చిత్సర్గవలనఁ దెలియఁగలదు. ధర్మము నిర్వచింపఁబడెను. రామాయణ మార్యుల దక్షిణదేశయాత్రను దెలుపునని కొందఱు చారిత్రికుల మతము. ఇది నిజమే కావచ్చును. అప్పుడు దక్షిణదేశ మిప్పటివలె బహుజనాకీర్ణము గాక యార్యులకంటె

భిన్నులగు కొన్ని జాతులవారిచే నావృతమై యుండెను. మహాభారతకాలమునాఁటికి దక్షిణదేశము రాజ్యములతో నిండినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది ... ఆర్యులు దక్షిణదేశమునకు రా మొదలిడిన దాదిగా వారి వాఙ్మయాభివృద్ధికి దక్షిణముఁ గూడఁ గొంత సాయపడెనని చెప్పవలెను. తరువాత సూత్రకాలము నాఁటికిఁ గొందఱు దాక్షిణాత్యులుకూడ సూత్రకర్తలై కొన్ని యాచారవ్యవహారాల నెలకొల్పిరి. ప్రథమార్యుల దక్షిణదేశాగమనము షుమా రిప్పటికి 3000 సం॥ లై యుండవలెనని కొందఱి యభిప్రాయము. ఈకాలము నింకను వెనుకకు నెట్టుట పరిశోధకుల యాచారమగుచున్నది. ...సూత్రకాలము క్రీ. పూ. 3 క్రీ.వె.2వ శతాబ్దముల మధ్యనని పాశ్చాత్యపండితు లభిప్రాయపడుచున్నారు. ఇట్టిసూత్రకారులలో దాక్షిణాత్యులుకూడఁ గలరు. బోధాయనాపస్తంబు లిందు ముఖ్యులు. ఈబోధాయనాపస్తంబులనుగూర్చి చెప్పునపుడు క్రీ. పూ. 7, 8 శతాబ్దములప్రాంతమున నార్యులు దక్షిణమునకు వచ్చియుండవలెనని డాక్టరు వింటర్నిజు గారభిప్రాయపడుచున్నారు. నిజము కనుగొన్న నీకాలమునకంటెఁ బూర్వమే కావలయును ... ఆకాలమునుండి యార్యవిజ్ఞానమునకు దక్షిణదేశము తోడ్పడుచునే యుండెను. ఉపనిషత్తులందుండు తత్త్వశాస్త్రవిషయములనుగూర్చి సూత్రకర్తలు దర్శనములు వ్రాయుకాలమునందుఁగూడఁ దద్విచనమునం దీదేశము సాయపడెను. ఆచారవ్యవహారముల దక్షిణసాంప్రదాయములు వెలువడెను. సూత్రకర్తల వ్రాతలలో నివి స్ఫుటముగాఁ జూడఁగలము ... దర్శనకాలమునకుఁ బూర్వమే యిచ్చట ... శైవవైష్ణవమతములు ప్రబలియున్నట్లు చరిత్రకారు లందఱును దెల్పుచున్నారు. ఇటీవలి పరిశ్రమలవలన నీద్రావిడనాగరికత యింకను ప్రాచీనమని చారిత్రికులు చెప్పుచున్నారు... ద్రావిడకుటుంబములకు ద్రావిడమే మాతృభాషగా నుండెను. ఇప్పటి దక్షిణభారతమునందలి బ్రాహ్మణాదిజాతులకు ద్రావిడభాష మాతృభాషగా నుండుట కిదియే కారణము. కాని యార్యవాఙ్మయము పరిశ్రమచేయఁబడుచు వేదాదులు నిరంతరపాఠప్రవచనములలో నుండెను. ఈయార్యులకు నదీతీరములు ముఖ్యస్థానములయ్యెను. వానిలోఁ గృష్ణ గోదావరి కావేరి తామ్రపర్ణి ముఖ్యములు. బోధాయనాపస్తంబులే కాక కాత్యాయనాదులగు వ్యాకరణశాస్త్రజ్ఞులుకూడ దక్షిణదేశవాసులేయని చారిత్రకుల యభిప్రాయము. ఉత్తరమువలెనే దక్షిణమును శిష్టుల కాటపట్టని తలంపఁబడుచుండెను. భాషలోఁగూడ దాక్షిణాత్యులు మార్పులఁ గలుగఁజేయుచుండిరి. ఈ మార్పుల నౌత్తరాహులు ప్రశంసించుచుండిరి.

కావున నన్నివిషయములలోను దాక్షిణాత్యసంప్రదాయములు వెడలి యౌత్తరాహులచే నామోదింపఁబడుచుండెను. క్రమముగా నార్యుల మతము విజ్ఞానము రాజధర్మము నితరధర్మము లన్నియు నాసేతుహిమాచలమును వ్యాపించుటయే కాక యితరదేశములకుఁగూడ వ్యాపించెనని యిటీవలి విమర్శకులు చెప్పుచున్నారు ... ఉపనిషత్తు లార్యతత్త్వసంబంధవిజ్ఞానమునకుఁ దుదిమాట. ఆధునికులు నూతనమని చెప్పు నన్నిసిద్ధాంతములు నిం దిమిడియున్నవి. సర్వతత్త్వవిషయములందునను వీనిని దుదిపలుకు లనుట వింతకాదు. ఈయార్యజాతి మిగిలినశాస్త్రములనుగూడ నశ్రద్ధచేయలేదు. కాని

మతము ప్రధానముగాఁగల జాతిగాన నన్నివిషయములకును ... మతవాతావరణము కల్పించుచుండెను. కావ్యనాటకసృష్టియే కాక వైద్యము జ్యోతిషముఁ దుదకు నాట్యము సంగీతము నలంకారకావ్యశాస్త్రములుగూడ వీరి పరిశ్రమలకు గుఱియయ్యెను. ఇటీవలివఱకును నర్థశాస్త్రమున వీరు పరిశ్రమచేయనట్లు పండితులు భావించిరి. కాని యిటీవల బయటకువచ్చిన కామందకీయ కౌటిల్యార్థశాస్త్రములు వారి పరిశ్రమను జాటుచున్నవి. కాని యన్నిశాఖలుగా మతమున కంగములు భావింపఁబడెను. ఇట్లిప్పటికి వనకువచ్చిన యార్యవిజ్ఞానము సర్వతోముఖము. ఉత్తరమున నుద్భవమందిన ప్రతివిషయమును దక్షిణమునకు వచ్చినవెనుక దాక్షిణాత్యులు దానిని దమకుఁ దగినట్లు మార్చుట యొకయాచారమయ్యెను. ఇట్లు శాఖోపశాఖలై వర్ధిలుచుండఁగా మహమ్మదీయదండయాత్రలు వచ్చెను. వీనిచే నుత్తరము దక్షిణభాగముకంటెఁ గష్టపరంపరలకుఁ బాలయ్యెను ... అల్లాయుద్దీన్ కిల్జిపరిపాలనమున వచ్చిన దండయాత్ర తప్ప దక్షిణమున నంతకుఁబూర్వ మితరమహమ్మదీయదండయాత్రలు కలంచలేదు. మహమ్మదు గజినీకాలమునుండి కొన్నిశతాబ్దము లుత్తరదేశము దినదినైకభయోత్పాతములచేఁ గాలముగడపెను. అందుచేత నీవాఙ్మయాభివృద్ధికిఁ గొంతదెబ్బ తగిలెను. 11 వ శతాబ్దముతరువాత నుత్తరభారత మీవాఙ్మయాభివృద్ధియందుఁ బాల్గొనుట తగ్గెను. కాని దక్షిణము తనకుఁ దోఁచినట్లు తదభివృద్ధికి సాయపడుచునే యుండెను. కుమారిలభట్టు శంకరాచార్యులు రామానుజాచార్యులు మధ్వాచార్యులు మొదలగు గొప్ప వ్యక్తులిచ్చటనుద్భవించి తద్విజ్ఞానాభివృద్ధిని సర్వతోముఖముగ సాగించిరి. మహమ్మదీయులు మొట్టమొదట దక్షిణమునకు వచ్చినది పదుమూఁడవ శతాబ్దారంభము. అంతకుఁబూర్వ మితరజాతులవా రనేకులు వచ్చి దక్షిణదేశము పరిపాలించినను నార్యుల నాగరకతకుఁ గాని వాఙ్మయమునకుఁ గాని శత్రువులుగా మెలంగక పోవుటయే కాక పైపెచ్చు వారితోఁ గలసిపోయి యొక్కొక్కప్పుడు వాని కూఁతకూడ నొసంగిరి. వారుతెచ్చిన నాగరకత యార్యులదానికంటె మిక్కిలి భిన్నము గాక పోవుటచే నట్లు తటస్థించెను. వీరియొక్కయు బౌద్ధవాఙ్మయములయొక్కయు సంబంధముచేత నార్యవిజ్ఞానవాఙ్మయములు బహువిశాలమై వఱలెను. మహమ్మదీయుల రాక చల్లనిది కాదు. వారినాగరకత వాఙ్మయము మతము భిన్నములగుటచేతను మతవ్యాపనమును ధనార్జనమును వారి ముఖ్యోద్దేశ్యములగుటచేతను భయమును బీడయు వారిముందు నడచెను. వారెచ్చటికేఁబోయినను బలవంతమున మతముఁగలుపుకొనుట దోపిడి యను 2 పనులఁ జేయసాఁగిరి. మతవ్యాపనమని వా రనేకక్రూరకృత్యము లొనర్చినట్లు గ్రంథదృష్టాంతములు కలవు. వీరికి దక్షిణభారతము దాదాపు 75 సం॥ లు గుఱియయ్యెను. ఈకాలమునందలి యీదేశస్థితి గంగాదేవీకృత మధురావిజయకావ్యమున మిక్కిలి రసవంతముగను గనులకుఁ గట్టినట్లును వర్ణింపఁబడినది.

శ్లో. సతతాధ్వరధూమసౌరభైః ప్రాఙ్నిగమోద్ఘోషణవద్భిరగ్రహారైః
అధునాజని విస్రమాంసగంధై రధికక్షీబ తురుష్కసింహనాదైః.
మధురోపవనం నిరీక్ష్య దూయే బహుశః ఖండితనాళికేరఖండం,
పరితో నృకరోటికోటిహారప్రచలచ్ఛూలపరంపరాపరీతం.
శ్వసితానలశోషితాధరాణి శ్లథజీర్ణాయిత చూర్ణకుంతలాని
బహుబాష్పపరిప్లుతేక్షణాని ద్రమిడానాం వదనాని వీక్ష్య దూయే.

హిమచందనవారిసేకశీతా న్యభవన్ యాని గృహాంగణాని రాజ్ఞాం
హృదయం మమ వేదయంతి తాని ద్విజబందీనయనాంబుదూషితాని.
శ్రుతిరస్తమితా, నయః ప్రలీనో, విరతా ధర్మకథా, చ్యుతం చరిత్రం,
సుకృతం కృత, మాభిజాత్యమస్తం, కిమివాన్యత్ ? కవిరేక ఏవ ధన్యః.

బ్రాహ్మణపండితులు వీరిదృష్టికి గురియైరి. వీరు మధుర రాజధానిగాఁ జేసికొని దాదాపు దక్షిణహిందూస్థానము నంతను దమపీడకు గురియొనర్చిరి. దేశమంతయు భయావహమయ్యెను. అందుచే నీకాలమున సంస్కృతవాఙ్మయమును బండితులును మూలల దాఁగుకొనవలసివచ్చెను. తరువాత విద్యానగరసామ్రాజ్యస్థాపనము.

వెంటనే చిరస్మరణీయులగు బుక్కరాయవిద్యారణ్యుల ప్రేరణమున బుక్కరాయల కుమారుఁడగు కంపరాయలు మధురనుండి మహమ్మదీయుని వెడలఁగొట్టి యార్యనాగరకతావాఙ్మయములకుఁ గలిగిన తాత్కాలికాంతరాయములను దొలఁగించెను. తరువాత 3 శతాబ్దములు వరల దక్షిణభారతమునఁ దద్విద్యా వాఙ్మయము లవిచ్ఛిన్నముగా నడచెను. కాని యుత్తరముమాత్రము వెనుకటి సంకలనమునుండి కోలుకొకపోవుటయే కాక యనేక రాజ్యపరివర్తనములకును దుష్ఫలముగావచ్చు యుద్ధములకును నిరంతరభయమునకును గురియగుటచే వెనుకటి యభివృద్ధిని మరలఁబొందలేకపోయెను. అందుచే నుత్తరదేశసంస్కృతవాఙ్మయము 11 వ శతాబ్దములోఁ జాలమట్టుకంతమయ్యెననియు నచ్చటచ్చటఁ గొంత పరిశ్రమ చేయఁబడినను నది వైశాల్యమునకుఁ జాలినంత కాదనియు సిద్ధము. మహమ్మదీయదండయాత్రకుఁ బూర్వపు దక్షిణసంస్కృతవాఙ్మయ ముత్తరదేశమునఁగూడ సంపూర్ణముగాఁ బ్రచారములోనుండి తద్రచయితల గ్రంథములు దేశమునందంతను బాఠప్రవచనములలో నుండెను. తరువాత 15, 16, 17 శతాబ్దములందలి దక్షిణదేశవాఙ్మయము సమగ్రముగా వెనుకటిదానివలె నఖిల భారత ప్రచారమును బడయలేదు. కాని కొందఱప్పయ్యదీక్షితులవంటి వ్యక్తులు దేశమంతను నాకర్షించిరి.

15 వ శతాబ్దమునఁ బాశ్చాత్యులు భారతదేశమునకు రా మొదలిడిరి. ప్రథమమునవచ్చిన పోర్చుగీసు డచ్చివారి కిక్కడ సంపూర్తిగా రాజ్యసంపాదన కాంక్ష లేకపోవుటచే నిచ్చటి నాగరకత వారి కంతగాఁ బట్టలేదు. వారు ముఖ్యముగా మతప్రచారముకొఱకు ... వచ్చిరి. తరువాతవచ్చిన ఫ్రెంచివారు రాజ్యసంపాదనముకొఱకు వచ్చినను నీదేశముయొక్క నాగరకతను జాతిమతరీతులను గనుగొనుటలో శ్రమతీసికొనలేదు. ఆంగ్లేయులుమాత్రము ప్రథమమున ముఖ్యముగా వర్తకముకొఱకై వచ్చినందున నిచ్చటి ప్రజలమనోవృత్తులు తెలిసికొనుట వారికిఁ గర్తవ్యమయ్యెను. అందులకై యిచ్చటిజాతిమతములును నాగరకతయు వారి నాకర్షించెను. వారందులఁ బరిశోధనము మొదలిడిరి. క్రమముగా రాజ్యమును సంపాదించి పాదుకొనిపోయిరి. రాజ్యముచేయుటకుఁ బ్రారంభించినంతనే యిచ్చటి ప్రజలయొక్క మనస్తత్త్వము తెలిసికొనుట యత్యవసరమయ్యెను. పరిశోధనములు విరివిగా సాగెను. హిందూదేశముయొక్క వైజ్ఞానికవిజయముకొఱకు కింగ్లీషు వ్యాప్తము చేసిరి. ప్రస్తుతపుటాంగ్లవిద్యాధికులగు హిందూదేశస్థులలోఁ జాలమంది యింగ్లండుమానసపుత్రులని చెప్పనగును.

క్రమముగా దళు నాగరకతయొక్క పూర్వరంగ మిచ్చటి ప్రాచీననాగరకతలోఁ గనుపట్టెను. భాషలోఁగూడ సంబంధము పొడసూపెను. సంస్కృతవాఙ్మయము

వారి పరిశోధనలకు గురియయ్యెను. ఉత్తరదేశ వాఙ్మయము ముఖ్యముగా వారి నాకర్షించెను ... దక్షిణ భారతసంస్కృత వాఙ్మయమునకు మహమ్మదీయుల దండయాత్రల యనంతరకాల మత్యుచ్ఛకాలము (15, 16, 17 శతాబ్దములు) ప్రథమమున నీవాఙ్మయమునుగూర్చి పాశ్చాత్యుల నేత్రములఁ దెఱచినది బర్నెలు పండితుఁడు. ఈయన తంజావూరుపుస్తకాలయమునందలి గ్రంథములనుగూర్చి తన పట్టికను క్రీ. శ. 1880 వ సం॥ ప్రకటించెను. అప్పటినుండి పాశ్చాత్యసంస్కృతపండితు లనేకు లిప్పటికి వచ్చి తద్గ్రంథములను జూచుట తటస్థించెను. దక్షిణ భారతముయొక్క దర్శనగ్రంథములే కాక కావ్యనాటకాలంకార శాస్త్రములం గూడ నుత్తమగ్రంథము లున్నవని యొక ప్రతీతి వ్యాపించి జర్మనీ మొదలగు దేశములనుండి యిప్పటికిఁ బండితులు వచ్చుటకు మొదలిడిరి. తంజావూరుపుస్తకాలయమునందలి యనేకము లుత్తమగ్రంథములు ఖండాంతరములకుఁ గాలునేతులతో నడచిపోయినట్లు చెప్పుదురు. మఱికొంద ఱిచ్చటికి వచ్చి ... పర్యటన మొనర్చి పేదబ్రాహ్మణులఁ గొలఁదిరూకలతో సంతృప్తులఁ గావించి యపూర్వములగు తాటియాకుగ్రంథములఁ గొనిపోయిరనుట నిర్వివాదము. పేదతన మేమి చేయించలేదు? లూడర్సను నొక జర్మనుపండితుఁడు దక్షిణదేశమునుండియందును దంజావూరునుండి యనేకములగు నమూల్యగ్రంథములను స్వల్పక్రయమునకుఁ గొనివచ్చినట్లు తనతోఁ జెప్పెనని యాటోస్ట్రీనను నొక జర్మనుపండితుఁడు నాతోఁ జెప్పినాఁడు. ఇది యసంభవము కాదు. ఇప్పు డిచ్చటను దొరకని కొన్ని యపూర్వగ్రంథములు లండనునందలి మ్యూజియమునందును స్టేటుసెక్రెటరిగారి లైబ్రరీయందును నున్నవని విదితమే కదా! శాయన భాష్యముతోఁ గూడిన యథర్వణవేదము యూరపుఖండములోఁ బ్రచురింపఁబడుట యందఱికిఁ దెలిసినవిషయమే. ఇప్పటికి ననేకాపూర్వగ్రంథములు మూలల దాఁగియుండుటయు నటకలపై దాఁచియుంచఁబడుటయు నిజము. ఇటీవల నప్పయ్యదీక్షితుల తండ్రియగు రంగరాజాధ్వరికృతమగు వివరణదర్పణమను పంచపాదికావివరణవ్యాఖ్యానమును గనుగొంటిమి. అది నందినాగరలిపియందు వ్రాయఁబడియుండుటచే నిదివఱ కెవ్వరిని నాకర్షించియుండలేదు. పరమేశ్వరుఁడు తత్ప్రచారమునకుఁ దోడ్పడుఁగాక. దక్షిణ భారతవాఙ్మయములోఁ దంజావూరునాయక కాలమున వెలసిన సంస్కృతవాఙ్మయమునుగూర్చి చెప్పుట యీవ్యాసావళియుద్దేశము. కవులకు రాజాస్థానములు రంగస్థలములగుటచే దక్షిణదేశమునందలి మధుర తంజావూరు వేలూరు తిరుచినాపల్లి కొత్తకోట మొదలగు రాజాస్థానములలో వీరు వెలసిరి. ముఖ్యవాఙ్మయపోషకులలోఁ దంజావూరు నాయకరాజులు ముఖ్యులు.

---

## —♦ సనాతనధర్మసమ్మేళనము, హైదరాబాదు ♦—

### మొదటి తీర్మానము

(1) ప్రతిమత ... సంప్రదాయములకు సమస్తరాజ్యములవారు నవశ్యము నీయవలసిన మూలభూతాధికార మేదనఁగా

... స్వాతంత్ర్యమే ... అన్ని రాజ్యముల ... యందు ... మూలసూత్రమై ... సార్వజనీనముగా నంగీకరింపఁబడినదికనుక నట్టివిషయములలోఁ బ్రభుత్వమువారెన్నటికి జోక్యము కలుగఁజేసికొనఁగూడదనియు

(2) శ్రీ విక్టోరియాచక్రవర్తిని చేతను ... తద్వంశీయుల ... చేతను ... భారతదేశములోని వివిధజాతులకు నట్టి మూలభూతాధికారమునే నిర్ధారణ సేయుచు...

పూచి యీయఁబడుచు వచ్చుటయే కాక ... ఇండియన్ పీనల్ కోడ్ను ... లో స్పష్టీకరింపఁబడినది కనుకను

(3) హైదరాబాదు రాజ్య ... స్థాపకులైన శ్రీ నిజాముల్ ముల్కు గారి చేతను దద్వంశీయప్రభువుల చేతను ... ఈహక్కే యీ రాజ్యములో ... ప్రధాన సూత్రముగ గ్రహించి ... ప్రజలకుఁ బూచి యీయఁబడియుండుట చేతను

(4) ... ఇండియన్ నేషనల్ కాంగ్రెసధ్యక్షులైన దాదాభాయినౌరోజీ గారును వారితరువాత నాస్థానము నలంకరించిన యితరాధ్యక్షులును నన్ని తెగల ప్రజల యెడ సదరుసభవారెట్లు నడచుకొనవలయునో నిర్ణయించుచు నీహక్కే ముఖ్య సిద్ధాంతముగఁ బ్రకటించినందునను

(5) ఈ మూలభూతాధికార తిరస్కారవార్తాప్రచారముగూడ నప్పటప్పటికి సంభవించుచు ... తీవ్రజాతిద్వేషములకు మతకలహములకు దొ ... మ్ములకు రక్తపాతములకుఁ దఱచుగఁ గారణ మగుచున్న దికనుకను

(6) మతమను మిషతో భారతదేశములోని వివిధజాతుల నిట్లు విడఁదీయుచు వచ్చుచున్న యీ దలఁగల్గు దుష్ఫలితములు... భారతదేశముయొక్కయు ముఖ్యముగా సంస్థానములయొక్కయు... పరంపరాభివృద్ధికి... విఘ్నకర... మైయున్నది కనుకను

(7) జాతిమత వైషమ్యమూలకమైన చెఱుపులను బుట్టకుండఁ జేయుటయే కాక ప్రస్తుతము కనుపించుచున్న జాతివైషమ్యకారణములఁగూడ నిర్మూలించుటకై తగు రాజ్యాంగవ్యవస్థలను సాధ్యమైనంత త్వరలో హైదరాబాదుప్రభుత్వమువారాత్మరక్షార్థమై తయారుచేసియుంచుకొనుట విశేషించి కోరఁదగియున్నందునను

హైదరాబాదు రాజ్యములోని సనాతనధార్మికసమ్మేళనము వారిచేఁ బ్రకటించి ప్రచారింపఁబడుచున్న నిశ్చితాభిప్రాయ మేమనఁగా.

(1) ... ప్రభువులును ప్రభుత్వశాఖవారును ... ప్రజల స్థిరమైన శాంతి సంపద సౌఖ్యములకై యవసరమగు మతస్వాతంత్ర్యము నాగరకతాసంస్కృతి ... లభించునట్లు రాజ్యశాసనవిధానమును ... ఏర్పాటుచేయుట యవసరమనియు.

(2) ఇట్టి రాజ్యాంగనిర్మాణము ...సమస్తజాతుల మతధర్మములమీఁదను సంస్కృతిమీఁదను సంప్రదాయములమీఁదను నాధారపడియుండునట్లు... చేయవలయునే కాని ... పాశ్చాత్యసిద్ధాంతముల...అనుకరణ...సంగ్రహములు కాఁగూడదనియు.

(3) ఈ మత ... సాంస్కృతికాది సర్వవిషయములను శాసనసభలయొక్కయుఁ గార్యనిర్వాహకసభయొక్కయు నధికారమునుండి ... తొలఁగించి ... ఆయామతముల ధర్మాధికారులచే ... నడిపింపఁబడు ... న్యాయసభలచేఁ దీర్మానింపఁ జేయవలయుననియు.

(4) ఆయా మతవిషయములగు ధార్మిక సాంస్కృతికాద్యధికారములను రక్షించుటకుఁ గావలసిన జన్మసిద్ధములైన హక్కులను గట్టుబాటులను గుఱించి ... స్పష్టశబ్దములతోఁ జట్టము స్వీకరింపఁబడిన యెడలఁ బ్రత్యేకజాతులకుఁ బ్రాతినిధ్యమిచ్చు నవసరము దానియంతట నదియే తొలఁగిపోవుననియు.

... ప్రజల సాధారణజీవితమునకు సంబంధించిన యార్థికాది ... సమస్తవిషయములు విచారించి నిర్ణయించుట కధికారముగలట్టి ... సమష్టిప్రజాప్రాతినిధ్యముమీఁద శాసనసభ యేర్పఱుపఁబడినయెడల రాజ్యములోని సమస్తప్రజలలోఁ బరస్పర జాతిస్నేహమును బరస్పర సహాయతను బుట్టించి ... విశేషలాభముగూడఁ గలుగును.

## —♦ రెండవ తీర్మానము ♦—

(1) వివాహమనునది పాశ్చాత్యుల పద్ధతి ప్రకారము గర్భాధానము కాదనియు వారు తలంచినట్లు వ్యావహారికసంబద్ధము గాదనియు నొక ప్రధానధార్మిక సంస్కారమనియు నందును రజోదర్శనపూర్వవివాహము సనాతనహిందూజాతులలోఁ గన్యల కనివార్యమగు శాస్త్రవిధిగ సనాతనధర్మశాస్త్రములు బోధించుచున్నవనియు ... ధర్మాచార్యులచేఁ బ్రామాణికమైన స్వాధికారముతో విశదీకరింపఁబడియుండుటచేతను

(2) ... తమ పిల్లలకు రజోదర్శనానంతరవివాహము సేయవలసినదని శాసించుట ... రాజశాసనపద్ధతిలోఁ జాల నాక్షేపణార్హ మగుటయే కాక ... నిర్బంధరూపమై సనాతనధర్మ ... వ్యతిరేక మగుటచేత ... సనాతనుల ధార్మికవిషయములయం దాత్మస్వాతంత్ర్యమున కొకపరిక్రమను బరస్పరజాతిస్నేహమున కింకొకపరిక్రమను జాల భంగకరము కాఁబట్టియు హైదరాబాదు రాజ్యములోని యీసనాతనసమ్మేళనము వారు

(1) ... హిందూబాల్యవివాహనిరోధశాసనము పేరుతో నీబిల్లును స్థానికసభలోఁ బ్రవేశపెట్టుటను ఖండించుచున్నారు.

(2) సనాతనహిందువుల ... ధార్మికవిషయముల ... యెడ గౌరవము చూపుటకే కాక యన్నిజాతులకు సంబంధించిన మతవిషయములలోఁ బ్రభుత్వము వారు శాసనరూపముగఁ గాని కార్యనిర్వాహక తదితరసంబంధముగఁ గాని జోక్యము కలుగఁజేసికొనఁగూడదనుట రాజ్యశాసనతత్త్వమును బర్యాలోచనసేయుచు నీబిల్లును బ్రవేశపెట్టినవారే యుపసంహరించుకొనవలసినదని ... అనురోధించుచున్నారు.

(3) మఱియు, వారిట్లు చేయనిచో ఘనతవహించిన నిజామ్‌ప్రభుత్వమువారును శాసనసభలోని ప్రజాప్రతినిధిసభ్యులును పైనుదాహరింపఁబడిన రాజ్యశాసనపద్ధతిసిద్ధాంతపుదృష్టిచే నాలోచించి సదరుబిల్లును ద్రోసివేయుచు శాసనసభలోఁ దదనంతరచర్చకూడ రాకుండ నడ్డుపడుదురని యీసభవారు గొప్ప నిశ్చయాత్మకమగు విశ్వాసముతో నిరీక్షించుచున్నారు ...

ఈతీర్మానములు శ్రీ గోవర్ధనమఠాధీశ్వరులు జగద్గురు శ్రీ పూరీశంకరాచార్యుల వారిచేఁ బ్రతిపాదింపఁబడి మహాసభలో నేకగ్రీవముగా నంగీకరింపఁబడినవి.

---

## —♦ నాగపుర మహాసభ ♦—

పండితప్రవర మల్లాది రామకృష్ణవిద్వచ్ఛ్రయములుగారు, బెజవాడ. ధార్మికప్రవర పిశుపాటి సుబ్రహ్మణ్యముగారు, మూలుపూరు, (గుంటూరు జిల్లా). పురాణం కృష్ణమూర్తిగారు, అడ్వోకేటు, బందరు. రాళ్ళభండి సీతారామశాస్త్రీగారు, అడ్వోకేటు, బందరు. రాయప్రోలు వెంకటరామసోమయాజులుగారు, హైదరాబాదు హరినారాయణశాస్త్రీజీ, హైదరాబాదు, సీతారామశాస్త్రిగారు, కంచి. రావుసాహెబు యస్. నటేశయ్యరుగారు, అడ్వోకేటు, దక్షిణమధుర. రాజరాజేశ్వరశాస్త్రిగారు, ద్రావిడులు, కాశి, తారాచరణభట్టాచార్య, సాహిత్యచక్రవర్తి, కాశి. స్వామి శివానందజీ, బ్రహ్మచారి, కాశి. మహామహోపాధ్యాయ దుర్గాచరణసాంఖ్య

వేదాంతతీర్థ, కలకత్తా. మహామహోపాధ్యాయ రామచంద్రశాస్త్రి, కలకత్తా. వాగీశ్వరశాస్త్రి, వ్యాకరణాచార్య, బొంబాయి. గోపీచంద్రశాస్త్రి, వంగదేశము, రఘునందనశర్మ, బీరారు. కర్మవీరగోస్వామిజీవనదాసు, ఉపాధ్యక్షు, అమృతసర్, పంజాబు మొదలగువారు సుమారు 500 మంది ప్రతినిధులు సభ నలంకరించిరి. నాగపూరు ప్రాంతీయులు కొన్నివేలమంది ప్రతిదినము సభకు వచ్చిరి.

విద్వత్పరిషత్తు చేసినతీర్మానములు.

1. కాశీస్థ వల్లభరాంసాలగ్రాం సాంగవేదవిద్యాలయప్రతిష్ఠాపకులైన మురారలాలజీ భరతవర్షమందు వేదశాస్త్రముల ప్రచారము వృద్ధిచేయుటకై యొకశాస్త్రమునందు సర్వోచ్చపరీక్షయం దుత్తీర్ణుఁడగు విద్యార్థి కొకపర్యాయము రు. 5000 రూప్యములు బహుమానముగా నిచ్చెదమని చేసిన ప్రతిజ్ఞ నభినందించుచుఁ బాఠశాలలయందుఁ బ్రతివిద్యార్థియు ధర్మశాస్త్ర రాజనీతిగ్రంథములఁ జదివితీరవలయు.

2. అఖిలభారతీయ వర్ణాశ్రమ స్వరాజ్యసంఘసభ్యుఁడగు ప్రతివ్యక్తియుఁ బ్రతిదినము "అధర్మగ్లానినివృత్త్యర్థం సనాతనధర్మానుష్ఠానాభిరుచ్యభివృద్ధ్యర్థం... దేవతాజపం (పారాయణం, ధ్యానం, నామసంకీర్తనం వా) కరిష్యే" అని సంకల్పించి యొక గడియకాలమునకుఁ దక్కువగాకుండ ననుష్ఠానము చేయవలయును. 15 దినముల కొకసారి సమావేశము జరిపి దానిలోఁ బాల్గొనవలయును అట్టిదానికి విఘ్నము ఘటించినచో నామాసమునఁ బ్రాయశ్చిత్తదక్షిణగా నాలుగణాలు సంఘమునకు సమర్పించవలయును. ఇట్టివారు సభాతీర్మానములలో వోటు కర్హులు.

3. కేవలతర్క మవ్యవస్థితము గనుక ధర్మనిర్ణాయకము కాఁజాలదు.

4. మీమాంసాపద్ధతినిబట్టియే శాస్త్రసమన్వయము చేయవలయును. మిగిలిన యంశములు మద్రాసు విద్వత్సభానిర్ణయానుసారము జరుగవలెను.

నేతృసమ్మేళనమునందుఁ జేసిన తీర్మానములు.

1. కాంగ్రెసుసంస్థ భారతవర్షీయుల కందఱకుఁ బ్రతినిధిసంస్థగాఁ దన్ను వ్యవహరించుకొనుచున్నది. ఇది కేవల మసత్యము. అప్పుల నెగవేయించు శాసనములఁ జేయించి బీదల పరపతిని బాడుఁజేసినది. పదునాలుగుసంవత్సరములకుఁ బైన నే బాలికలకు వివాహము కావలయునని శాసనము చేయించి భరతఖండమునందు శాస్త్రీయమగు బ్రాహ్మణవంశము లేకుండఁ జేయుటకుఁ బాల్పడినది.

2. శ్రుతిస్మృతులయం దెక్కడ నంగీకరింపనట్టియుఁ బంచములచేఁ గోరఁబడనట్టియు దేవాపచారమూలమున దేశారిష్టము కలుగఁజేయునట్టియుఁ బంచమదేవమందిరప్రవేశము పురికొల్పి పరస్పరకలహములను ననర్థములను బెంపుఁజేయుచున్నది. మహమ్మదీయాచారములకుఁ దోడ్పడుచున్నది. ఇట్టి విపత్పరంపరలకు మూలముగాన నీకాంగ్రెసుసంస్థతో సనాతనధార్మికులమగు మా కెట్టిసంబంధము లేదు. కనుక నీకాంగ్రెసుసంస్థ మాప్రతినిధిసంస్థ కాదు.

3. హిందూమహాసభ మహమ్మదీయులు హిందువులపైఁ జేయు నత్యాచారముల నివారించుట మాకు సమ్మతమే యైనను ధర్మశాస్త్రములకు విరుద్ధమైన వర్ణసంకరాదికృత్యముల నంగీకరించుచున్నందున నదియు మాసంస్థకు విరుద్ధము.

ఇత్యాదులు గొప్పయుపన్యాసకులచేఁ జర్చించి నిర్ణయింపఁబడినవి.

కం. అవని భవాదృశరచిత
వ్యవహారంబునన జంతువర్గము మేరల్
జవదాఁటకుండుఁ, బృథ్వీ
ధవ ! నీవే యట్టిహద్దు దాఁటఁ దగునే ? 195

తే. జ్వలనరక్షితమగు సుధాభాండమట్లు
మౌనిరక్షితుఁడైన నీసూనుఁ డస్త్ర
వేది యైనను గాకున్న లేదు భయము
అతని క్రవ్యాదులైన వంచలే రసురు లధిప ! 196

ఉ. ఈ కుశికాత్మజుం డనఁగ నేమిగ నీమదిలోఁ దలంతో ! సు
శ్లోకుఁడు, ధర్మమూర్తి, మునిలోకశిఖామణి, యుజ్జ్వలత్తప
శ్శ్రీకిఁ బరాయణం, బమలశేముషికి న్నిధి, శూరులందుఁ గ
న్నాకు, మహాస్త్రవేది, నరనాథ ! భయంపడ నేల యీగతిన్ ? 197

కం. ఇతఁ డెఱుఁగునస్త్రరాజము
లితరు లెఱుఁగ రెఱుఁగఁబోవ రిఁకముందు జగ
త్త్రితయమున దేవరక్షః
పితృపన్నగసిద్ధసాధ్యవిద్యాధరులున్. 198

వ. ఇమ్మునివరుం డస్త్రసంతానంబుఁ బడసినవిధంబు వినుము. 199

సీ. దక్షప్రజాపతితనయలు జయయు సు
ప్రభ యనువారలు పరమమతులు
అల కృశాశ్వునకు నిల్లాండ్రయి తమ నాథు
సేవలచేత మెచ్చించి యసుర
వధమునకై లబ్ధవరలై కనిరి చెఱి
యేఁబండ్రసుతుల నహీనబలుల
వైరిదుర్జయుల దుర్వారుల వీరుల
రుద్రతేజుల జగద్భద్రకరుల

తే. వారలఁ గృశాశ్వుఁ డిమ్మునివరున కొసఁగె
నితఁడు మును రాజ్యమును బొంది యేలువేళ
నది మొదలుగాఁగ వారు మహాస్త్రరూప
మున భజింపుచునుందు రియ్యనఘచరితు. 200

కం. ఏవంవిధవీర్యుఁడు సు
మ్మీ విశ్వామిత్రమౌని, యియ్యనఘుఁడు గో
పోవుటకు రామదెస నీ
కావంతయుఁ జింతవలవ దమలచరిత్రా! 201

చ. విను నొకమాట యియ్యమితవీర్యసమేతుఁడు చెంతనుండఁగా
మనుజుని మిత్తి చేరినను మానిచి వే యమరత్వమిచ్చుఁ గా
వున నిఁక మూఢమానవునిపోలిక దీనత మాని మౌనితోఁ
బనుపుము రామచంద్రుని శుభం బొనఁగూడు నసంశయంబుగన్. 202

వ. అని పలుతెఱంగుల వసిష్ఠుండు వచియింపఁ బంక్తిరథుండు సం
ప్రహృష్టమనస్కుండై ప్రతీహారిం గాంచి "ఓరీ, నీ వేగి రామ
భద్రుని లక్ష్మణసహితంబుగాఁ దోడితెమ్ము"నుటయు నతండు
త్వరితగమనంబున నంతఃపురమందిరంబున కరిగి ముహూర్తమాత్రం
బునఁ బునరాగతుండై భూకాంతునకుం బ్రణమిల్లి యిట్లనియె. 203

—♦ పరిచారకులు శ్రీరామవైమనస్యమును దశరథునకు వర్ణించి చెప్పుట ♦—

తే. అవధరింపుము దేవ! మహానుభావ!
రామచంద్రుఁడు నిజమందిరంబునందుఁ
గడు విషణ్ణతఁ గాలంబు గడుపుచుండెఁ
బద్మగర్భాన రేయి షట్పదముభంగి. 204

కం. ఒకచో నిదె వచ్చెద నను
నొకచో నెదియో తలంచు నూరక నిలుచున్
వికలమనస్కునితీరున
నొకరికడన్ క్షణము నిలువనొల్లఁడు దేవా! 205

వ. అని ప్రతీహారి విన్నవించుటయు నంతకుమున్న శ్రీరామచంద్రుని
వైమనస్యంబునకై వగచుచుఁ దద్వృత్తాంతంబు ధరణీశున కెఱిం
గింప నుద్యుక్తులైయుండి ప్రతీహారివెంట నరుదెంచిన రామపరిచార
కుల నూరడించి దశరథుండు రామభద్రుని వర్తనంబు యథాక్ర
మంబుగఁ దెల్పుఁడని యడుగుటయు వారలు ఖిన్నులై యమ్మహీ
పతి కిట్లనిరి. 206

తే. తామరసనేత్రుఁడైన శ్రీరామమూర్తి
బ్రాహ్మణులతోడఁ దీర్థయాత్రల ముగించి

తిరిగివచ్చినదాదిగా దేవ ! యేమొ
మనసు చెడియున్న రీతిగా మాకుఁ దోఁచు. 207

ఆ. జతనములను మే ము బ్రతిమాల బ్రతిమాల
మోము ముడుచుకొనుచు నేమి యనక
దివసకృత్యములను దీర్చు నొక్కొకవేళ
నొక్కవేళ నదియు నొల్లఁ డధిప ! 208

శా. స్నానధ్యానసురార్చనాశనకథాశయ్యాసనారామడో
లానిద్రాదుల నిచ్చగింపఁడు ప్రియాలాపంబులన్ దమ్ములన్
సానందంబుగఁ జేరఁజీరఁడు సువర్ణానర్ఘభూషాంబర
శ్రేణిం గైకొననొల్లఁ డేమికతమో శ్రీరాముఁ డుర్వీశ్వరా ! 209

తే. భోగయోగ్యంబు పేశలంబును మనోహ
రంబు స్వాదువు నగు పదార్థంబుఁ గాంచి
రెండుకన్నుల బాష్పముల్ నిండుకొనఁగఁ
బరితపించును మాచిన్నిదొర నృపాల ! 210

తే. చతురలాస్యవినోదముల్ సలుపువార
వనితలను గాంచి "దుఃఖదాయినులు వీర
లిచట నూరక నటియింపనేల ? " యనుచు
మోము ద్రిప్పు నదేమొ; శ్రీరాముఁ డధిప ! 211

మ. సిరితోడం బనియేమి ? యాపదలచేఁ జిక్కేమి ? యీనవ్యమం
దిరవారంబులతోడ నేమి ? మృషగాదే సర్వముల్! వీనికై
పరితాపంపడ నేల ? యనుచు సకలవ్యాపారముల్ మాని యొ
క్కరుఁడే యొక్కెడఁ గూరుచుండును విరాగగ్రస్తచిత్తంబునన్. 212

కం. దరహాసమైనఁ జేయఁడు,
పరిహాసోక్తులకు భోగపరతం గనఁ, డా
దర మూనఁ డెట్టికార్యో
త్కరముల మౌనంబె యెపుడు దాల్చు నరేంద్రా ! 213

కం. లోలాలకవల్లరులును
హేలావలితాత్ములైన హేలావతు లా
బాలునకు మోద మొసఁగం
జాలరు హరిణాంగనలు కుజంబునకువలెన్. 214

చ. అవని విమూఢమానవుల కమ్ముడువోయిన సౌమ్యభంగిఁ బెన్
దివులు వహించి యేకతమ నిర్జనదేశమునందు సుప్రశాం
త విపినభూములందు సతతంబు వసింపఁగఁగోరుఁ గాని యే
తవులము లిచ్చగింపఁడు సుధామధురాత్ముఁ డదేమిహేతువో. 215

తే. వసనధారణ భోజన పానముఖ్య
కర్మములయందుఁ గడు విముఖత్వ మూని
నీ కుమారుండు యతిధర్మనియతి నున్న
తపసివడువున నున్నాఁడు ధరణినాథ ! 216

ఉ నీసుతుఁ డొక్కమాఱు ధరణీవర! నిర్జనదేశమందుఁ బ
ద్మాసనమూని వామకరమందుఁ గపోలముఁ జేర్చి చిత్తమున్
వీసరవోనినిశ్చలత వృత్తివిదూర మొనర్చి మౌనియై
హాసమునైన రోదనమునైన నొనర్పకయుండు నిండుగన్. 217

చ. మనమున నించుకేని యభిమాన మెఱుంగఁడు, రాజభావమం
దునఁ దగులంబుఁజెందఁ, డవధూతగతిన్ సుఖమందుఁ బొంగఁ డా
ర్తిని నొకయింత క్రుంగఁ, డెవరిన్ బరిచర్యకు బిల్వఁ డిట్టులం
చని యెదియున్ వచింపఁ డకటా! రఘురాముఁ డిదేమిచిత్రమో! 218

కం. ఏమి యొనర్చునో ? తలఁచునో ?
యేమి మదిని గోరి పరువులెత్తునో రాముం
డేమిటి కెచ్చటి కేగునో ?
యేమిటికై వచ్చునొక్కొ ? యెఱుఁగము తండ్రీ ! 219

కం. ప్రత్యహము కార్శ్యముం గను
బ్రత్యహము విరాగమందుఁ బొందుత నెనయున్
బ్రత్యహము రాఘవుఁడు శర
దత్యయమున వృక్షమట్టు లవనీనాథా ! 220

కం. రామప్రతిబింబము లా
సౌమిత్రిరిపుఘ్ను లగ్రజాతునివలెనే
భూమీశ! కార్శ్య మందిరి
మేమును నట్లగుట గాదుమేనులె తెల్పున్. 221

కం. అనుచరులు రాజపుత్త్రులు
జనులు పలుమాఱు తన్ను సంప్రశ్నింపన్.

మనరాముఁ డేమియును లే
దని మిన్నకయుండు నిస్పృహత్వము తోఁపన్. 222

కం. మతిమంతులుఁ బార్శ్వగులగు
హితులం గని క్షణికసుఖము లిహభోగములన్
మతి నుంచఁబోకుఁ డనుచున్
హితవున్ బోధించు రాముఁ డెడనెడ దేవా! 223

కం. లలితవిలాసపుఁజెయువులఁ
జెలువుల విలసిల్లువలపుఁజెలువలఁ గని యీ
వెలఁదుక లెదుటంగల కే
వలమృత్యువు లంచు నులికిపడు మనుజేంద్రా! 224

తే. ఆయు వంతయుఁ గట! వృథాయగుచునుండెఁ
గద; నిరాయాసనిర్వాణపదవిదూర
కృత్యముల నంచుఁ బలుమాఱు ఖిన్నుఁ డగుచుఁ
బలుకు లోలోనఁ గాకలీకలరవమున. 225

ఆ. "రాజ వగుదు నీవు రామచంద్రా" యంచుఁ
జెంతఁజేరి పల్కు సేవకుఁ గని
వెడఁగుమాటలాడు వీఁడింబలె నవ్వ
మౌన మూని యన్యమానసమున. 226

ఆ. ఎదుట నున్న వస్తు వేనియుఁ గానఁడు;
ఎవ్వ రేమి యనిన నెదియు వినఁడు;
ఏపదార్థమందు నేని దిరస్కృతిఁ
జూపుఁగాని కోర్కెఁ జూపఁ డెపుడు. 227

కం. ఆకాశవనమునందలి । యాకాశాబ్జినివిధాన నాశ్చర్యకరం
బై కన్పట్టుమనం బిది । గాక విచిత్రంబు వేఱె కలదెయని యనున్.

కం. వనితలనడుమనె యున్నను
మనసిజబాణంబు లతనిమది నణుమాత్రం
బును భేదింపఁగఁజాలవు
ఘనతరజలధార లురునగంబును బోలెన్. 229

తే. ఆపదల కెల్లఁ గాఁపురమైన ధనము
గోర నేమిటి కోవెట్టులార! యనుచు

జాలిమీఱ వచించుచు సకలధనము
నర్థుల కొసంగు శ్రీరాముఁ డవనినాథ ! 230

కం. ఇది యాపద యియ్యది సం
పద యను మోహంబు మనసువలన నెకద య
భ్యుదిత మగు ననుచు నెప్పుడుఁ
జదువుఁ శ్లోకముల రామచంద్రుఁడు దేవా ! 231

తే. ఆపదల మున్గి " హా ! దైవమా! " యటంచు
బిట్టు హాహాపువారయ్యు నట్టివెతకు
హేతువగు సంసృతిన్ నరు లిచ్చ విడరు
చిత్ర మిదియంచు రాముఁ డచ్చెరువుఁ బొందు. 232

చ. తనయందున్ బరునందు శత్రునెడ మిత్రంబందు రాజ్యంబునన్
ధనమందున్ దలిదంద్రులందు నిజభృత్యవాశ్రితమం దాప్తులం
దనుగుందమ్ములయందు సంపదలయం దాపత్తులం దెట్టియా
స్థను బూనం డివియెల్లఁ గేవల మసత్యంబంచు లో నెంచుచున్.

తే. తనకు లౌకికకార్యతత్పరతఁ గఱప
నెదుటికేతెంచు రాజన్యునేని విప్రు
నేని మూఢాత్మునిగ మది నెంచి లఘుత
హాస మొనరించు నవ్యగ్రుఁ డగుచు దేవ ! 234

చ. వఱపున నెండవేఁడిమికి వా తడియారఁగ మిన్ను చూచు చా
తురపడు చాతకంబుగతిఁ దోఁపదుఃఖమునన్ మునుంగుచున్
గురువులఁ జుట్టపక్కములఁ గూరిమితమ్ముల రాచతీవులన్
బరిజనులన్ సుహృజ్జనులఁ బ్రాణములన్ విసువందు భూవరా !

కం. నీపుత్రునకు విరాగం। బీపగిదిన్ దినదినాభివృద్ధిం గాంచెన్
భూపాలవర్య! నీవీ। యాపదఁ బాపంగఁదగు దయాంపదహృదయా!

ఆ. ఇట్టిచిత్తవృత్తి నెనసిన యమ్మహా
బాహు నెవ్వరేని బ్రకృతమార్గ
మునకుఁద్రిప్పఁగలరె ? భూమీతలంబున
దేవ ! యిందు మాకు నీవె దిక్కు. 237

చ. పరమతమం బడంచి నిజభాస్కరభావము సార్థకంబుగా
వఱలెడి లోకబాంధవునిభాతి రఘూద్వహుమానసంబునం

దిరవయియున్న మోహాములమెల్ల హరించి నిజోపదేష్టృతా
స్ఫురణఫలంబు గాంచఁగల సూరివరుం డెవఁడో కదా ప్రభూ! 238

వ. అని విన్నవించు రామపరిచారకులం గని గాధినందనుండు "అటు లయిన మీర లరిగి హరిణంబులు హరిణపతింబోలె రఘునందను న విలంబముగఁ గొనిరం" డని యానతిచ్చి వెండియు నిట్లనియె. 239

—♦ విశ్వామిత్రుఁడు శ్రీరాము వైమనస్యమును దొలఁగింతు ననుట ♦—

మ. దిగులొందన్ బనిలేదు, రాఘవున కీదృఙ్మోహ మూహింప నే
తగులాటంబునఁగాని యాపదలచేతంగాని రాలేదు సుం
డు గరిష్ఠాశయులార! సాధుసుజనేడ్యుం డైనయాసర్వభ
ద్రగుణోపేతునియందుఁ గల్గిన సుబోధం బిద్ది యూహింపఁగన్.

కం. ఇటకున్ రాముఁడు వచ్చిన
నిటనే తన్మోహమెల్ల నేఁ దొలఁగింతున్
బటుతరమారుత మంబుద
పటలిన్ గిరినుండి తోలుపగిది క్షణమునన్. 241

కం. ఇమ్మోహముఁ దగినయుపా
యమ్మున మార్జనమొనర్చినంతనె రాముం
డుమ్మలికయెల్ల విడి బ్ర
హ్మమ్మున విశ్రాంతి నందు మాదృశులగతిన్. 242

వ. వెండియు. 243

తే. అమితసత్త్వప్రదీపితుండై తనర్చు
హేయ మెదియొ యుపాదేయ మెదియొ యెఱుఁగు
సౌఖ్యదుఃఖస్థితులయందు శాంతుఁ డగును
గాంచు సమబుద్ధి లోష్టాశ్మ కాంచనముల. 244

వ. అటులయ్యును స్వధర్మంబును వంశపరంపరాయాతంబును నగువర్ణాశ్రమోచితవ్యవహారం బనాసక్తచిత్తుండై సలుపం గలవాఁడు. కావున మీర లడలవలదని మునితిలకుండు పలుకుచుండ నాలో శ్రీరామచంద్రుండు నిజదైనందినక్రియాక్రమంబునఁ బితృపాదాభివందనంబు గావింప నుదయాద్రినుండి వెడలు బాలభానుని విధంబున నిజమందిరాసనంబుననుండి బయలుదేఱి కతిపయపరిజనంబులు వెంటరా లక్ష్మణశత్రుఘ్నసహితుండై పితృస్థానంబు దావవ్వలం గాంచి యందు. 245

—• శ్రీరాముఁడు దశరథునిసభకు వచ్చుట •—

సీ. అమరౌఘసంవృతుం డైనవాసవురీతి
నవనీశపరివృతుం డైనవాని
ఒకవైపున వసిష్ఠుఁ డొక్కవైపున గాధి
నందనుం డొప్పఁ జెన్నొందువాని
సర్వశాస్త్రార్థ విశారదు లగుమంత్రి
పుంగవుల్ గొలువఁ జెలంగువాని
జలజేక్షణాహస్తసంభృతచామరా
వలి వీజ్యమానుఁడై యలరువాని
తే. తనయునొా మనుపూర్ణచంద్రుని గనంగఁ
బొంగుచుండెడి మానసాంభోధితోడఁ
జూడ్కులు నిగుడ్చి తెన్నులు సూచువాని
నాత్మజనకుని గని భక్తి యతిశయిల్ల. 246
తే. ప్రమథపతిఁ జూడవచ్చిన కొమరుసామి
చెలువు దళుకొత్తఁగా నమస్కృతి యొనర్చెఁ
జారుచూడామణిమరీచిసముదయంబు
కరము వెలుఁగంగ నుత్తమాంగంబు వంచి. 247
వ. అట్టిసమయంబునంద యాస్థానంబునందుండి వసిష్ఠవిశ్వామిత్ర దశర
థాదులును. 248
సీ. ననలెత్తు నునుజవ్వనము మేనఁ గలవాని
వృద్ధులవలె శాంతి వెలయువాని
విశ్రాంతి కుదురక వెతచెందు మతివాని
నిండినిండని కోర్కిపిండువాని
సంసారగుణచర్చ సలిపి రోసినవానిఁ
గడు పొగడ్తకు నెక్కునడతవానిఁ
జొక్కంపుగొనముల కిక్కయై తగువాని
ఘనసత్వసంపదఁ గ్రాలువాని
తే. ముక్తికాంతకు వలపులు మొలవఁ జేయు
చారువైరాగ్యరుచులఁ జెన్నారువాని
వినయ మాకృతిఁ దాల్చినవిధము దోఁపఁ
జేర నేతెంచురాముఁ గాంచిరి ముదాన. 249

ఉ. మానవనాథ! ఇట్టి యభిమానధనుం డెఱుఁగంగఁజాలెనే
ఆనలినాయతాక్షుల దురాచరణం? బది యట్టులేచుమీ.
ఏనరుఁడైన నిట్టివెత లించుకయైన నెఱుంగఁ, డింతటన్
మానసవీథిఁ జూచుకొనుమా. ఇఁకఁ దెల్పఁగనేర మేమియున్. 116

తే. గీ. అనుచు బాలసరస్వతీవనిత విక్ర । మార్కుతోఁ దెల్పె ...

కం. ... మంత్రిపుంగవసుత య
ప్పాటం దెలిపిన నాదొర నాటిన చింతాభరంబునన్ మన మగలన్.

తే. గీ. కొంతతడ వుండి యందు నొక్కింతయేని
తెలియనే? ఎక్కడిపరాకు? పలుకు మనుచు
కదళికాకాంతపైఁ జేతికమ్మవిరుల
చెండు వైచినఁ దత్సతీసరసిజాక్షి. 118

తే. గీ. సొమ్మసిలినట్లు వ్రాలినఁ జూచి విక్ర
మార్కభూపాలవరుఁడు హాహానినాదుఁ
డగుచు విలపింపఁ జని వయస్యాజనంబు
శీతలక్రియ లొనరింప సేదఁదేఱె. 119

చం. అదిగని పుష్పహాసుఁ డహాహాయని నవ్వఁ బ్రసూనవర్ష మ
భ్యుదయముగాఁగ నంతట విభుండు కనుంగొని తీవ్రకోపుఁడై
అదయుఁడ. వింతెకాక యొకయప్పుడు నవ్వనివాఁడ. విప్పు డీ
మదవతి పుష్పపాతమున మూర్ఛపడినన్ వడి నవ్వనేటికిన్? 120

చం. అనవిని యయ్యమాత్యుఁడు ధరాధిప! మున్నొక యద్భుతంబు నేఁ
గనుఁగొనఁగంటిఁగాన బహుకాలము తద్వ్యథఁ గుందియున్కి నే
పనులను నవ్వకుండితి. సభాస్థలి నేఁడొక యద్భుతంబుఁ జూ
చినకతనన్ మనంబు వికసించిన నవ్వితి. చిత్తగింపుమా. 121

తే. గీ. అధిప! ఈయమ్మవారు మర్యాద పోవ
విడిచి నగ రెట్లువెడలెనో? వెడలివచ్చి
తేరుక్రిందటి మరుగుజ్జుఁ జేరి వాని
కలసి యేతెంచు. ఇది మీకుఁ గానఁబడదు. 122

ఉ. దేవర కొల్వుదేరిన మదీయగృహంబున కేగువాఁడనై
ఏ వెసఁ బోవుచోఁ గురిసె వృద్ధవరాహకఠోరఘుర్ఘురా

రావమహాశనిధ్వనిపరంపరతో నొక వాన మొన్న రే.
యావిలమానసాంబుజుఁడనై యొక మండపసీమఁ జేరితిన్. 123

తే. గీ. అచ్చటికి వచ్చె నిమ్మందయాన. వచ్చి
తేరుక్రింది ప్రతీక్షణాధీనుఁడైన
గుజ్జుఁ జేరిన వాఁ డతిక్రుద్ధుఁ డగుచు
ఇంతతడవేల రావైతివే యటంచు. 124

తే. గీ. గుండియలు గ్రుళ్ళఁ దన్నిన గ్రుక్కుమిక్కు
రనక యాతని కినుక చల్లారనిచ్చి
విక్రమార్కుండు నిద్రగావించుదనుక
వెడలి రారా దటంచును వేడుకొనియె. 125

తే. గీ. అతని పదఘాతముల కోర్చినట్టిదాని
కి వ్విరులబంతి వ్రేటున కింతమూర్ఛ
వచ్చెనే యంచు నవ్వితి వసుమతీశ !
చనవరి యటంచు నాతప్పు సైఁపవలయు. 126

కం. అన విక్రమార్కభూపతి
విని వెఱఁగున ముక్కుమీఁద వ్రేలిడి చింతన్
మునుఁగుచు బాలసరస్వతిఁ
గని తెలిసెన్ మీనహాసకారణ మాలే. 127

తే. గీ. కాకయుండినఁ దైలపక్వంబులైన
మత్స్యములు నవ్వునే యంచు మందబుద్ధి
నక్కటా ! కాననైతి. ఊహాంతలాడి
వగలు నమ్మితిఁ గద పతివ్రత యటంచు. 128

కం. అని మఱియుఁ బదియుఁ బదియును
గనుగొని కదళికకు నాజ్ఞ గల్పించెన్ శా
స్త్రనిరూపితపద్ధతి నజ్జననాథుఁడు . . . 129

తే. గీ. . . . అవ్విధంబున నిజసతి కాజ్ఞ నెట్టి
పుష్పహాసుని జూచి యింపులు ఘటింప 130

శా. ఈయాశ్చర్యము కంటి మేకద ! పురాదృష్టాద్భుతం బేమియో
ఆయాఖ్యానముఁ దెల్పుమన్న నతఁ డుద్యత్ప్రేమతో నిట్లనున్

కావునఁ గించిదుష్ణాన్నభోజన మారోగ్యకరమని వాడుచుందురు. వండిన పదార్థము లెల్లం దినువారికి కాఁబెట్టవలెఁ గాని యొండుమనుష్యులవస్తువుల వడ్డించరాదు. కావుననే నిందాపరముగ నక్కాలమున నన్నము శిగినవారికి వండియాఁబెట్టితిమని వాడుచుందురు. భోజనము చేయుటకు వెనుక ముందు కొన్ని నిమిషములైన విశ్రాంతి యవసరము. అట్టివిశ్రాంతి లేనిచో జఠరాగ్ని చులుకనగఁ బని చేయఁజాలదు. భోజనానంతరము చేయు విడెము జీర్ణము చేయుటకు సహకారి. అందు సూక్ష్మముగ జాజికాయం జేర్చిన మతింత సాధకమగును. తాంబూలచర్వణముచేఁ జాఱుసోవ మంకురించును. పసిపిల్లలకుఁ బాల్లూడి వెండినప్పుడును నుమ్మనీరు తగినంతగ నూఱదు కావున బలకరములగు పదార్థములు మితముగ నిచ్చుచుండవలెను. లేనిచో వారి కారోగ్యభంగమగును. బిడ్డలారోగ్యముగ నుండవలెనంచునఁ గలిగెడు బాధ తప్పులకే యొకఁగ.

జగ:- నీ విన్నిసంగతులు గాలి నీరు తిండిని గుఱించి చెప్పుచుంటివి. నిద్రలేక యుండ లేమే? అదికూడఁ గొంచెము వినిపింపు.

## —♦ నిద్ర ♦—

కృ:- జంతుల కన్నిటికి నాహారముతోపాటు నిద్రయు నవసరము. సరియైన నిద్ర లేకుండిన నారోగ్యభంగము కలుగును. రోగగ్రస్తుల కాహారము సరిగ రుచించనట్లు సరియైన నిద్రయుఁ బట్టదు. మితాహారము గొనువారికి మంచి నిద్ర పట్టును. మంచి యారోగ్యవంతునకుఁ బూర్ణముగ నిద్రావేశము గలిగినపుడు తానెట్టిస్థితియం దుండినను దానిని నాఁపఁజాలఁడు. నిద్రావేశముచే నడుమడఁబడినవారును గుఱ్ఱముమీఁదినుండి బండినుండి జాఱిపడినవారును గలరని చెప్పుట వింతకాదు. మనుష్యుల దేహారోగ్యమును వయసును బట్టి నిద్రాకాలమును బలమును మాఱుచుండును. పసివాండ్రకుంబలె నెదుగుచుండు పిన్నవయసువారికిని నిద్రాకాల మధికముగ వలసియుండును. ఎదిగినవారికి దినమున కేడు గంటల నిద్ర చాలును. నిద్రాకాలపరిమితి యేఁడాదివఱకు 20 గంటలు. 2 వ సం॥ 14 గం. 3, 4 సం॥ లు 12 గం. 5, 6, 7, 8, 9 సం॥ లు 10 గం. 10, 11, 12, 13, 14 సం॥ లు 9 గం. 15, 16, 17, 18, 19 సం॥ లు 8 గం. 20 దగ్గఱనుంచి 7 గంటలు రాత్రి నిద్రలేకుంటుట రోగమును బుట్టించును. అటులనే పగటినిద్రయు రోగహేతువు.

కావున రాత్రులు నిద్రమానుటగాని పగలు నిద్రించుటగాని కూడదు. పగటిభోజనానంతర మొకగడియ విశ్రమించుటయు రాత్రిభోజనానంతర మొకగంట విశ్రమించకుండుటయు నారోగ్యాభివృద్ధికరములని తచ్ఛాస్త్రవేత్తలు నుడివియున్నారు. గాఢనిద్రనుండి మేల్కాంచినవారి శరీరమును బుద్ధియు విశ్రాంతినొందుచోఁ గార్యకరణమునం దుత్సాహముకలిగియుండును. దినమంతయు వివిధవ్యాయామములం దిరిగి యలసినవారు మంచి నిద్రపోవుటచేత నలసి చేయఁజాలక నగలిన పనుల నొనరించుటకు మరల శరీరబలమును

బుద్ధిబలమును దీసికొని యుండఁగలరు. పరమేశ్వరుఁడు నిద్రనిచ్చి శరీరమునకును బుద్ధికిని దివమందుఁగలిగిన నలుగుడు నివృత్తిగావించియున్నాఁడు. 10

కం. కూరుకుననుండి మఱి తెల
వాఱకమును మేలుకాంచువారికి నిలఁ జే
కూరును దీర్ఘాయుష్యం
బారోగ్యజ్ఞానధనము లమితంబులుగన్.

కం. తొలిజామున నిద్రఁజని
తెలవారకమున్న లేచి దినకృత్యములన్
తలపెట్టువారి కెప్పుడు
బలపడు నారోగ్య బుద్ధిబలములు వరుసన్.

రాత్రి ప్రథమయామానంతరము మొదలు చతుర్థయామాదివఱకు నిద్రించు వారికిఁ జిరాయురారోగ్యైశ్వర్యములు లభించును. లోకమునంగల వృద్ధుల యొక్కయు క్షేమసిద్ధులయొక్కయుఁ జరిత్రల నరసి తెలిసికొన వారిలోఁ బెక్కండ్రు పెందలకడఁ బరుండి పెందలకడ మేల్కనువారలే యనియుఁ దదభ్యాసమే వారల దేహమనోబలములఁ గాపాడుచున్నదనియు విదితము కాక పోదు. రాత్రులు పొద్దుపోవువఱకు మేల్కనియుండుటయు సూర్యోదయానంతరమువఱకు నిద్రించుటయు బుద్ధివికాసమునకు నారోగ్యమునకు భంగకరములు. కడుపునిండఁ గుడుపుదొరకనివార లాఁకలిచే బాధపడుచుండునట్లు కంటినిండ నిద్రలేనివారలు బడలికచే నధికాయాసము ననుభవించుచుందురు. జనసామాన్య ముపవసించఁ గలంతకాలము నిద్రలేకుండ నుండఁజాలరు. ఆఁకలి రుచి యెఱుఁగదు. నిద్ర సుఖ మెఱుఁగదను సామెత కలదు. దీనిచే నిద్రావేశపరవశు లెట్టిస్థితియందును నిద్రింపఁగలరనియు క్షుద్బాధాపీడితు లెట్టిపదార్థమునైన రుచి నరయక భుజింపఁగలరనియుఁ దెలియుచున్నది. నిద్రించునపు డూపిరాడుట కవకాశము లేనట్లు దట్టమగు పుట్టముల బిఱ్ఱబిగించుకొని పరుండరాదు. దానిచే విడిచినవాయువునే మరలమరలఁ బీల్చుచుండుటచే మన కారోగ్యభంగమగును.

## —♦ వస్త్రములు ♦—

జగ:— జీవు లన్నిటిలోను బట్టలు వాడునది మానవజాతి యొక్కటిగనే యున్నది. ఇఁక నేజంతువునకు నీవాడుక లేనట్లు తోఁచుచున్నది.

కృ:— సృష్టియందు జీవులగుఱించి విచారించినఁ బరమానంద మగుచుండును. అట్టి జంతువులలో మనుష్యజాతి విలక్షణమైనది. ఆకారమునఁ జాలరెట్లు గొప్ప వగుజంతువులు కలవు. కాని బుద్ధియందుమాత్ర మన్నిజంతువులును మానవులకు లోఁబడునవిగనే యున్నవి. అడవియందుండు నేనుఁగు సముద్రముననుండు కొన్నితరగతుల చేఁపలును నాకారమునఁ బెద్దవయ్యు శబరకైవర్తకుల వలలఁ

జిక్కుట మన మెఱుఁగుదుము. ఇంతియే కాక జంతువర్గములో మానవుఁ డొక్కఁడే తల నెత్తుగ నుంచి నిలువుగనుండి సంచరించఁగలిగియున్నాఁడు. సృష్టిప్రపంచముయొక్క భూతకాలచరిత్రలును భగవద్జ్ఞానము మానవజాతికిఁ దప్ప నిఁక నేయితరజంతువులకు నగోచరము. కావుననే మనుజులు జంతుజాలమున నుత్తమజన్మకలవారని నిశ్చయించఁదగియున్నది. కేవల శరీరావయవములతోఁ బనులనొనరించుట గాక మానవజాతి యొకటియే వివిధాయుధముల నొనరించుకొనఁగలిగియున్నది. అటులనే శరీరములు శీతవాతములపాలు గాకుండ వస్త్రముల నేసికొనుటకును వాని నుపయోగించుకొనుటకును సామర్థ్యము కలిగియున్నది. శీతవాతములచేత బాధనొందకుండ భగవంతుఁడు సృష్టివర్గమునఁ బెక్కుజంతువులకు నొడలెల్ల రోమజాతి ప్రసాదించియున్నాఁడు. ఇట్టి రోమజాతిగల జంతువుల త్వగింద్రియము మృదువుగ నుండును. మఱికొన్ని మందమగు చర్మము కలిగియున్నవి. అట్టివాని శరీరమునిండ బొచ్చు దట్టముగ నుండదు. బొచ్చు దేహమునిండఁ గల జంతువుల కది శీతకాలమునఁ బెరిఁగి దట్టమై వానికిఁ జలి దగులకుండఁ గాపాడుచు వేసవికాలమగునప్పటికి రాలిపోయి పల్చబడి వానికి సుఖమునిచ్చుటయు సృష్టిచిత్రముల నొక మహానందసంధాయక మగుచున్నది. మానవజాతి కొంటినిండ బొచ్చుగాని దట్టమగు చర్మముగాని లేదు. జ్ఞానేంద్రియములను భగవంతుఁడు మనకుఁ బ్రసాదించియున్నాఁడు. చలికాలమున శీతముచేతను వేసవికాలమున నుష్ణముచేతను బాధనొందకుండ మనశరీరముల కనుకూలవస్త్రముల ధరించుచుందుము. వస్త్రధారణముచే మన యొడలు మోటువాఱక మృదువుగ నుండును. దానిచే మన చక్కదన మధికమగును. మలినమగుట తఱుగును. మానసంరక్షణ మొనరించుచు ననేకములగు నపాయములనుండి వస్త్రములు మనలం గాపాడుచుండును. జంతుజాల మెల్లఁ దమశరీరమునంగల చర్మమును దులిపి మాలిన్యవిసర్జన మొనరించుకొనఁగలిగియున్నది. కాని మానవజాతి కిట్టిసామర్థ్యము లేదు. కావున వస్త్రధారణముచే మాలిన్య మంటకుండఁ గాపాడుకొనుచు దినమున కొకటి రెండుసారులు స్నానమాచరించి వస్త్రము లుండినను నంటు మాలిన్యమును క్షాళన మొనరించుకొనవలెను. మనశరీరములనుండి యొడ తెగక చెమటయు విషవాయువులు వెడలుచు వస్త్రముల ధరింపకుండినచో మనకు నితరులకుఁ జూడ నసహ్యత కలిగించుచుండును. కావున వీలగువఱకు శరీరమునిండ వస్త్రాచ్ఛాదన మొనరించికొనియుండుట మేలు. చెట్లవలన లభ్యమగు ప్రత్తినుండియు నార నుండియుఁ గొన్నిజంతువుల శరీరమునిండ నొప్పారు మృదురోమరాజినుండియు దారము తీసి వస్త్రముల నేయుదురు. పసిఁడికాయలనుండియు దారము తీసి చేలము గావించెదరు. ప్రత్తితోనొనరించిన వలువలు బట్టలనియు నారవడికె నేసిన మడుఁగులు నారగుడ్డలనియు నున్నిదారముతో నేసిన గుడ్డలు కంబళులు ధావళులనియుఁ బట్టుదారముతో నేసినవి మాంజిష్ఠములనియు వాడుదుము. ఉన్నిచేతను నూలుచేతను బట్టుదారముచేతను నేసిన వస్త్రములు మనదేహమునకుఁ గాఁకనిచ్చును. నారచీరలు చలువ నొసఁగును. అన్నిరకముల వస్త్ర

ములతోను నాణెముగలవిగను సామాన్యమైనవిగను నొనరించెదరు. నాఁడెము విలువ గల దుకూలములు ద్రవ్యవంతులకు మాత్రమే సమకూరుచుండును. సామాన్యజను లెల్లరు వెలతక్కువగల పుట్టములఁ గట్టుచుందురు. జను లెల్లను దాము నివసించు దేశముయొక్క శీతోష్ణస్థితి ననుసరించి తగినవస్త్రముల ధరించు నభ్యాసము కలిగియుందురు. మనము నివసించునది యుష్ణదేశమగుటచే సన్నని ప్రత్తినూలుకోకల వదులుగ ధరించు నలవాటు కలిగియున్నాము. శీతల ప్రదేశములనుండువారు బొచ్చుతో నేసిన దళసరివలువల నొంటి కంటునట్లు ధరించి శీతబాధ తగ్గించుకొను నలవాటు కలిగియున్నారు. కాలము ననుసరించియు మనము వస్త్రముల ధరించుచుందుము. వేసవికాలమున సన్నని నూలుగుడ్డలను నారచీరలును జలికాలమున మందములగు నూలు నున్ని దుప్పటులను ధరించెదము. ఇట్టినా రొప్పవరించుకొను టారోగ్యమున కనుకూలమని మన మెఱిఁగిన యంశమే. ఇక్కాలంబునఁ బొగయోడలమీఁదియుఁ బొగబండ్లమీఁదియు గమనములచే నెల్లదేశములందును ఖండాంతరవాసులు ధారాళముగ సంచరించుచున్నారు. మనవారు కొందఱు దుస్తుల ధరించుట కితరదేశములవారి ననుసరించుచున్నారు. మనదేశపు స్థితి ననుసరించి విచారించిన సుఖసౌలభ్య దూరంబగు తదాచారావలంబన మంత శ్లాఘనీయముగ నుండఁజాలదు. దేశాంతరవాసులు స్వకీయాచారవేషభాషల మార్పుల కియ్యకొనకుండుట గాంచి మనవారు తదనుకరణ మొనరించికొనకుండుట శ్రేయస్కరి. ఇటీవలఁ గొంతకాలమునుండి యంత్రముల సహాయముచే సన్ననివస్త్రముల నేసి దేశమెల్లెడ వ్యాపింపఁజేసిన యాంగ్లేయులు వస్త్రముల నేసికొనుటయు ధరించుటయు నేర్వకపూర్వమే మనదేశీయులు సన్నని మజిలినులు నేయుటకును ధరించుటకును సమర్థత కలిగియుండిరి. ఈసన్నవస్త్రము లాదికాలమున బందరునుండి యింగ్లాండునకుఁ గొంపోఁబడుచు వచ్చినందున నాదేశమున నీదేశమున నేయఁబడు సన్ననివస్త్రములు మజిలినులని యిప్పటికిని వారు వాడుచున్నారు. చేతనేసిన వలువల మన వాడుక యధికమైనను యంత్రాగతములు స్వల్పక్రయమునకు లభ్యమగుచుండుటచే నెల్లవారు వానినే కొని ధరించుచున్నారు. అందువలన నస్మద్దేశీయులగు నేఁతపనివాండ్రకుఁ జేతినిండఁ బనిలేక వృత్త్యంతరముల నవలంబించుచున్నారు. మనవారికి స్వదేశీయపదార్థసన్మానము కొఱఁతపడియున్నది. దేశాంతరవాసులు స్వదేశవస్తూపయోగము పట్టుదలతో నిర్వర్తించుకొను నలవాటు కలిగియున్నారని తెలియుచున్నది. అది గొప్ప గౌరవమని వారు తలంచుచుందురు. ఆంగ్లేయులు ముదుగువస్త్రముల నేసికొన నేర్చినపిమ్మట మనదేశమునుండి యనుపఁబడిన సన్ననివలువల ధరించఁగూడదని నియమ మేర్పఱచికొని యందుకు భిన్నముగ సంచరించినవారిని బహిష్కరించి దేశాభిమానమును బలపఱచి కాలక్రమమునఁ దాము సన్నని దుకూలముల నేయనేర్చి మన నేఁతపని నణఁగఁ ద్రొక్కియున్నారు. ఏమి వారి దేశభక్తి! ఏటేట నటనుండి మనదేశమున కఱువదియైదుకోట్ల రూపాయల విలువగల వస్త్రములు నూలు దిగుమతి యగుచున్నది.

—♦ అక్కలు, వారిబిడ్డలు, వారిబిడ్డలు ♦—

మేనకోడలు భీమమాంబకు శంకరశాస్త్రి తరువాతిసంతానము జోగమ్మ. అది నందాకోటయ్యచేఁ బరిణీతయై పలువురు పిల్లలం గనినది. మంచిపేరుతో మనినది. కోటయ్య పంచదశస్మార్తమంత్రములను బఠించి విద్వత్సమక్షముననే వివాహోపనయనాదులను సవిమర్శముగా నలిపింపఁగలిగియుండియుఁ బౌరోహిత్యమును బంటవలంతియుం నంతగా లేమిని బెదతండ్రియైన పెదనరసింహముతోఁ బెద్దకాలము పెరదేశములఁ జరించి సంపాదించుచు సతీసుతుల సంరక్షించెను.

పెదనరసింహము పెద్ద విద్వాంసుఁడు గాకున్నను విద్వాంసులకంటెను విశేషించి విత్తమార్జించు వేడబము కలవాఁడు. సాముద్రికమనియు నేమోయనియు జనరంజనముచేయు శక్తిగలవాఁడు. మంచి వక్త. పరిహాసకుఁడు. ఏవంవిధుఁడయియే యెంతయో ధన మార్జించెను. పెద్దలనాఁటినుండియు నుండు పిన్నెలి విడిచి జానపాటఁ దానుండెను. శ్వశురగృహనివాసమే స్వర్గతుల్యముగా భావించెను. తచ్ఛ్వశురగృహనిర్వాహణభారముగూడఁ దలఁదాల్చెను. తద్గృహ సవిధముననే తానును గృహముకట్టెను. పరదేశసంచరణమునఁ బడయు ప్రభూతవిత్తముతో నుభయకుటుంబముల నోముటయే కాక పిన్నెలినున్న చిన్ననరసింహమునకుఁగూడఁ జిరకాలము చేయూఁతనిచ్చెను. అప్పులిచ్చి యనేకుల నాదుకొనియెను. చాలకాల మట్లు సంపన్నగృహస్థుఁడై సకృదాచరిత సహస్రబ్రాహ్మణసమారాధనమే కాక ద్వాదశిబ్రాహ్మణభోజనముగూడఁ దద్దయుం సాగించెను. కుంట వేయించెను. ఆరామము నారంభించెను. ఆరబ్ధమైన పుంసంతానమున సప్తసంఖ్య సంపూర్ణము గాకున్నను నాలోపము స్త్రీసంతానమునఁ దీర్చుకొఁ గలిగెను. ఆత్మజానిగూడ నొకనిఁ గని కాలకర్మవశత వర్తమానమున వంశాంకురమే లేకున్నను నతఁడుమాత్ర మష్టపుత్రబహుధనము ననుభవించెను. నరసింహము నానాగుణములలోఁ బరిహాసకతయే ప్రథమగణనీయము. ఆపరిహాసకతతోనే యందఱను నభిముఖులఁ జేసికొనెడివాఁడు. తనమీఁదఁ బద్యములుచెప్పుమని నన్నుఁ గోరుచుండెడివాఁడు. అతని కోరికపై నపుడు నేనును నున్నది యున్నట్లు పరిహాసముగాఁ బద్యములు చెప్పెడివాఁడను. అయ్యవి మచ్చున కిట నొకటి రెండు ప్రదర్శ్యమానములు.

మ· కవులన్ మెచ్చఁడు· పండితోక్తుల వెసన్ ఖండించు· దైవజ్ఞులన్
రవిసిద్ధాంతము మీఱెఱుంగరను· ఆర్యవ్రాతమున్ దూఱు ...

మ· పశులౌ రామనకృష్ణయాఖ్యు లడలన్ వాచాటతం జూపుచున్
శశిరేఖాదిసుతాళి పొత్తునఁ గడున్ సంబాధముం జేయఁగా
దశఘంటల్ పడువేళ నొక్కరుఁడె మున్ దా భుక్తిసల్పున్ మహా
దశ నందా నరసింహనామకునకే ధాత్రీస్థలిం జెల్లెఁగా!

మ. 'అశ! ప్రొద్దెక్కెను, నిల్వలేనుగదవే, అన్నంబు వే వడవే,
శశిరేఖేది? జనార్దనుండెచటఁదా? చారన్న మెందుండెనే?
దశ నీ'-యంచు విలాసవాక్కులు సతిం దాఁజేరి పల్కున్ మహా
దశ నందా నరసింహనామకున కిద్ధాత్రీస్థలిం జెల్లెఁబో!

ఆనరసింహము ననుజుఁడైన చిననరసింహము తనూజుఁడే కోటయ్య. ఆకోటయ్య కూఁతుండ్రి నిరువురను గొడుకుల నిరువురను బడసి యందుఁ బెద్దదైన శేషమ్మను జంగమేశ్వరపురనివాసి పోచెంచెర్ల లక్ష్మీనారాయణకును ననంతరజయైన యనసూయను మాయూరిలో మా ముత్తాతసహోదరు మునిమనుమఁడైన రామయ్య మనుమఁడును దనకు మేనల్లుఁడును నైన యాంజనేయులకును నిచ్చి పెండ్లి చేసెను. ప్రాక్తనకర్మవశత నబ్బాల లిరువురును బతుకులం బాసిరి. అందుఁ బెద్దదగు శేషమ్మ పెనిమిటితోడి ప్రథమసమావేశ సుఖమైనను బడయకమునుపే ప్రాప్తవైధవ్యయై పంచశరవంచనమున భ్రష్టయైపోయినది. అనసూయ యా ప్రథమసమావేశసుఖ మాంజనేయులతో ననుభవించినదన్నమాటయే కాని యంతలోనే వాని నంతకుఁడు కొనిపోయెను. కోటయ్య కొడుకులలోఁ బెద్దవాఁడు సుబ్రహ్మణ్యము. పంచదశస్మార్తమంత్రములును బంచకావ్యములును బఠించెనఁట. వీని పాణిగృహీతి జూలకల్లుగ్రామనివాసియగు దేవరపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి సుత సుబ్బమ్మ. దాని తల్లి కోటయ్యపెత్తండ్రియైన పెదనరసింహము బిడ్డయే. సుబ్రహ్మణ్యశాస్త్రి సుత పెండ్లి చేయకముందే సురలోకమున కరుగుటయు నమ్మ యంతమ్మ యాకుటుంబము నవనించుచున్నది. మగదిక్కు లేదు. అందువలన నంతమ్మకోడలి యక్కయుఁ గోటయ్యకుఁ బెదతండ్రికూఁతురు నగు శశిరేఖ సుబ్రహ్మణ్యమునకు సోదరిసుత నిప్పించి యిల్లటముగానుండుట కల్లు నర్థించెను. కోటయ్యయు నిందుల కిష్టపడియెను. కొడుకు బుడుతఁడగుటఁ గొంతకాలము సుతసతీయుతముగా జూలకంటిలో సుబ్రహ్మణ్యశాస్త్రియింట నుండి తానే తత్కుటుంబమును సవరించుటకుఁ దలపడియెను. వత్సరార్థము వసించెను. అత్తవారి యాస్తి యంతయు నాత్మజు పేర వ్రాసియిమ్మని యడిగెను. అట్లు జరుగకుండుటయు నన్నమాట చెల్లింపకుండనే యట నుండి లేచెను. అటుతిరిగియు నిటుతిరిగియు బానమటఁది శంకరశాస్త్రియున్న బాపట్లను బ్రవేశించెను. వైదికమున వలసినంత ప్రవేశముకలిగియుండుటచేఁ దద్ద్వారమునఁ దగినంత ధనము నార్జించి స్వకుటుంబమును సంరక్షించుకొనుచుఁ బ్రమాధి సం॥ కార్తికము (1939 నవంబరు) నఁ బంచత్వమును బ్రాపించెను. జోగమ్మ సుతుల నిరువురను సుతను బెట్టుకొని బాపట్లనే ప్రవర్తిలుచున్నది. కోడలు రజస్వలయై కొడుకు సమాగమమును గోరుచున్నది. తదనంతరతనయుఁడగు సత్యనారాయణ త్రయోదశాబ్దవయస్కుఁడు. పితచేతనే కృతోపనీతుఁడు. జోగమ్మ సుతయగు ననసూయకు 5 ఎకరముల మెరకయు నెకరము పల్లమును మగనియాస్తి మాయూర మిగిలియున్నది. అదియు జానపాటి పురుషోత్తమునకుఁ దాకట్టు. పదియేండ్లనాఁడు పతిదీసికొన్న వందరూపాయల ఋణము వడ్డితోఁ దీర్చినఁగాని వశపడదు.

జోగమ్మతరువాత నారాయణశాస్త్రి. వీఁడును వేదాంతశిరోమణి. తెనాలి సంస్కృతపాఠశాలలోనే దీనిఁ జదివెను. శిష్టఘోరమువలన నాంగ్లేయవిద్యాపఠనము గూడ నైనయది. కృష్ణామండలస్థమగు దివితాలూకాలోని శ్రీకాకుళమను గ్రామమునందు జొన్నవిత్తుల రామావధానుల తనయ కనకదుర్గ వీని చాన. ఈదంపతులకు నిరువురు సంతానము. ఒకఁ డుమాపతిసమాఖ్యుఁడు. పరాయతము పఠించినాఁడు. కావ్యపాఠము కావలసినంత కాలేదు కాని స్మార్తమును జదువుచున్నాఁడు. దివితాలూకాలోనిదే యగు గూడపాడుగ్రామనివాసి కూచిభట్ల సత్యనారాయణ కూఁతు బాలాత్రిపురసుందరి నిచ్చి వీనికిఁ బరిణయము కావించెను. నారాయణ కుమాపతి తరువాతి

బిడ్డ సీతారామమ్మ. ఇది యిప్పుడు వర్షచతుష్టయవయస్క. నారాయణశాస్త్రి శ్రీకాకుళమున మామయింటనే మనుచున్నవాఁడు.

వీనితరువాత మహాలక్ష్మి. దాని బదులిచ్చియే తనయుఁడైన నారాయణకుఁ దండ్రి పెండ్లిచేసెను. నారాయణ బావమఱఁది కోటిలింగయ్యయే మహాలక్ష్మి మగఁడు. ఆయనతో నది రెండేండ్లుమాత్రమే కాఁపురముచేసినది. అంతలోనే యతని కాయువు పరిపూర్తియగుటయు నన్న నారాయణశాస్త్రియొద్దనే యది యున్నది.

ఆతరువాత సీతారామమ్మ. దాని బదులిచ్చియే శంకరశాస్త్రి ద్వితీయవివాహము సలుపుకొనియెను. వానిబావమఱఁది సుబ్రహ్మణ్యమే దానిభర్త. ఈయిరువురు నీడు జోడుగాఁ గర మల్పకాలమే కాఁపురము చేసిరి. అంతలోనే సీతారామమ్మ యసువులువిడిచినది.

మాసోదరి జోగమ్మకు భీమరాంబతరువాతిపట్టి పర్వతవర్ధని. దానిపెండ్లి కాక పూర్వమే తల్లి తనువు విడుచుటయుఁ దండ్రి మరలఁ బెండ్లాడుటకు మనసువెట్టెను. అద్దాని బదులిచ్చియే యాకోర్కి తీర్చుకొనియెను. శేవల్లెతాలూకా ధూళిపూడి గ్రామనివాసి పాతూరు కుమారస్వామి పర్వతవర్ధని భర్త. ఇది పెండ్లినాఁటికే యేకాదశాబ్దవయస్క. కడుశీఘ్రముగనే కాఁపురమునకుఁ బోయినది. ఒకటిరెండేండ్లే సుకమున్నది. ఇంతలోనే యంతరించినది.

అటుతరువాతిది యప్పమ్మ. మూడవదిగూడ నాడదే యగుటకు ముక్కలు విఱిచి తుదకు దానికే తాతపేరు పెట్టిరి. వీండ్ర నందఱిని గనుటకే మాయక్క గాని మిగిలిన దంతయు మేనత్తలది. పెంచుటకును బేరులు పెట్టుటకును నంతకును నవ్వారిదే యధికారము. మేనత్తల పెంపుడునుండి మేనమామలమీఁద వాండ్రికిఁ బెద్దపెరుఁగువఱకుఁ బ్రేమ లేకుండెడిది. అన్న కోటయ్య యవ్వారికే వశుఁడై వర్తించెడివాఁడు. అప్పమ్మ నాయూరనే యక్కంభట్ల కర్పించుట కాత్మ నెంచినాఁడు. అక్కంభట్లు పాతూరి యప్పయ్య యారసుఁడు. బాల్యము వెళ్ళియు వెళ్ళకమునుపే పదుచుతనపుఁబనులు చేసి పరదేశములకుఁ బలాయితుఁడైన పాపిష్ఠుఁడు. పలాయితుఁడయినను నాయన భ్రష్టుఁడుగాక శిష్టులలోనే చేరెను. యోగాభ్యాసము చేసెను. వేదాంతవిదుఁడయ్యెను. కొన కనేకులకు గురువై యగుచుఁ గొండాడఁబడియెను. ఆసమాచారము వినియు నాయనతండ్రిచే నభ్యర్థింపఁబడియుఁ గోటయ్య కూఁతు నాతని కిచ్చుటకుఁ గోర్కెపడియెను. అక్కంభట్లుపదియెకరముల భూస్వామి. అదియే యట్లు కోర్కె పడుటకాదికారణము. కోర్కెపడినఁ బడియెఁగాని పరదేశమందున్న వరుఁడు వచ్చుటెట్లు ? కూఁతునుగుఱించి కోటయ్యయే ధార్వాడప్రాంతములకుఁ దఱలెను. వివిధప్రదేశములు వెదకెను. వనభూములనుండు మునిపల్లెలలోఁ గొన కక్కంభట్లను గనుగొనియెను. కాని జటావల్కలధారియై సర్వదా తపమునుండు నాయన యీయన నత్తులు విప్పి యవలోకింపఁడు. అట్లు కేవల యోగనిష్ఠాగరిష్ఠతం గిమ్మనికూఁత నననియమ్మనియుంవకు నదనువెంట నభిముఖుఁజేసికొని కోటయ్య కొన కెట్లో నకరకంటికి నడిపించెను. పట్టినిచ్చి పరిణయముఁజేసెను. అక్కంభట్లు యమనియమాదు లెట్లున్నను నాసనప్రాణాయామప్రత్యాహారములలో నాటితేటినవాఁడు. కాని కాముకుఁడు. బాల్యమందే పట్టువడిన యదిమాత్రము వదలక యప్పమ్మయం దత్యనురాగముతో నేబదియేండ్లో కాఁపురము చేసెనుగాని కపుడు ఫలింపక పోఁగాఁ గడ కది పుడమిని

గూడ విడిచిపోయెను. మన్నంతకాలము మంచిపేరుతో సంచరించెను. అనంతర మక్కంభట్లు రేపల్లెతాలూకాలోని పేటేరునుండు మేనత్తకొడుకు నిరాఘాటము యానాది యాత్మజం బెండ్లాడి తనయ నొకరితం గని దాని పెండ్లికాకపూర్వమే తనువువిడిచెను. రెండవపెండ్లము కూడ నాయన యుండఁగనే యంతరించినది. బిడ్డను మేనమామయే పెండ్లాడెనఁట. అక్కంభట్లు వ్యయపెట్టఁగా మిగిలిన యాస్తి యమ్ముకొని యాదంపతులు పేటేరులోనే నాటుకొనిపోయిరి.

అప్పమ్మతరువాతిది రాజలక్ష్మి. అది పుట్టిననాఁటినుండియు బోలెడురోగములతోఁ బూర్యమాణ. మాయక్క మాయింటికివచ్చినప్పు డేడాదియీడుగల యీ రాజలక్ష్మి మెడలో నేవియో దండలు వేయించుటకు షుమారు పదియేండ్ల ప్రాయపు నేను గోటనెములిపురి కెత్తుకొనిపోవుచుండెడివాఁడను. అప్పు డారోగ్యము కలిగినను నది యైదాఱేండ్లలోపలనే యవివాహితగనే యసువులు వీడినది.

దీనితరువాతిది సీతారామమ్మ. దాని యేడాదియీడుననే తల్లి కలరావ్యాధిచేఁ గాలధర్మము నొందుచుఁ దన చినతమ్ముఁడనైన నాకిచ్చి పెండ్లిచేయుఁడని యనినదఁట. కాని బాల్యవైరాగ్యమునఁ బర్యటించునే నిష్టపడమి నది యట్లు కాక సత్తెనపల్లి తాలూకా గణపవరగ్రామనివాసి చల్లా శేషయ్యకు సమర్పింపఁబడినది. ఈ యక్కబిడ్డల నందఱిని మేనయత్తలు మిక్కిలి గారాబముతోఁ బెంచి మీఁది కెక్కించుకొనుటచేఁ బెద్దపెరుఁగుపఱుపుఁ బెంకెతన మెక్కువగా నుండెడిది. అందులో నాఖరుదియగు సీతారామమ్మ యగ్రగణ్య. అట్టి మకురుపిల్ల యత్తింటి కరిగినప్పటినుండి పతిభక్తి నమ్రత మర్యాద కలిగి యత్యంత స్తవనీయ యాయెను. ప్రొద్దుపొడువక మున్నె నిద్రలేచి నిజనాథుచరణములు నేత్రముల కద్దుకొనకుండఁ బాత్రాదికములు పట్టుకొని పనిచేసెడిది కాదు. అక్క లందఱును నట్టివారే కాని యందును నది యగ్రగణ్య. అట్టిపతిభక్తితో నది యైదాఱేండ్లే కాఁపురము చేసినది. గర్భమే దానిని గడముట్టించినది. అనారోగ్యముతో నాస్పెటాలు కరిగి యాఖరుకు నకరకల్లు నర్సారావుపేటల నడుమ నొడలు విడిచినది.

జోగమ్మ తరువాతియక్క రామలక్ష్మమ్మ. ఆమె నర్సారావుపేటలో మేళ్ళచెఱువు శేషాచలమున కీయఁబడినది. తక్కినయక్కలకంటె నీయమ స్వరూపస్వభావములచేతనే నాగరక. అటుపై నర్సారాయపురవాస్తవ్యగూడ నైనయది. పదిపంద్రెండేండ్లు పతితోఁ గాఁపురము చేసినది. అత్తలక్రిందను బావలక్రిందను దోడికోడండ్ర క్రిందను నణఁగిమణఁగి యున్నది. ఒకకూఁతును నొకకొడుకును గన్నది. కొడుకునుగన్న కొలఁదికాలముననే వైధవ్యముఁ గొన్నది. అన్య్య లట్లుండ నమ్మకుఁ దప్ప నాఖరుకు జనకునకు ననుజులకే యాస్య మగపఱుపక యబ్ద్వయము మంచములోనే మన్నది. స్వర్గమునకుఁ జన్నది. ఇఁక నాకె పతిప్రాణతం బాఠకులే పరిశీలింతురుగాక.

ఈమెబిడ్డ శ్యామలాంబ. అది మాయింటనే పుట్టినది. అప్పటికి నేను 5 ఏండ్లవాఁడను. దాని 4, 5 ఏండ్లప్రాయముననే తలిదండ్రులు తనువు విడిచిరి. పెత్తండ్రుల భార్యలు పెంచిరి. తండ్రికంటెను బూర్వమే పెదతండ్రియును బెద్దలంగలియుటచే బిల్లల మేనత్తపెనిమిటి రాచకొండ మహాదేవయ్య యాకుటుంబమును నవరించుచు నచ్చుటనే వచ్చియుండెను. ఆత్మజునిచేతనే శ్యామలపాణిగ్రహణము చేయించెను.

## సహాయులు

౧ పెండెకంటి కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి
౨ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల
౪ తిరుమల నల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల; అయ్యవార్లంగారు . [illegible]
౫ రాయచూరి బండేరావుగారు, అయినాపురము.
౬ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.
౭ చిక్కాల రాజా మట్టపల్లిరావుగారు - చెలపర్తి.
౮ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు

శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపు పీఠము

౯ రామరాజభూషణ భాషానిలయము - పెంట్లవెల్లి.
౧౦ అద్దంకి ... తిరువేంగడతాతదేశికాచార్యులయ్యవార్లంగారు, [illegible]
౧౧ మిర్యాలపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.
౧౨ మల్లాది నరసింహమూర్తిగారు, ప్లీడరు, గురజాల.
౧౩ కొత్వాలి కమలాకరరావు దేశముఖుగారు, నల్లపల్లి.
౧౪ ముద్దసాని వెంకటేశ్వరరావుదేశముఖుగారు, పులిగిళ్ళ
౧౫ రాజా మంత్రిప్రగడ వెంకటరామానుజరావుగారు, లింగగిరి.
౧౬ జింకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గురజాల.
౧౭ వద్దిరాజు సత్యనారాయణరావు దేశపాండ్యాగారు, మేడిపల్లి.
౧౮ గొట్టిపర్తి సుబ్బారావుగారు, వకీలు, సింగరేణి కాలరీసు.
౧౯ మారేపల్లి వెంకటకిషన్ రావు, మాధవరావు దేశముఖు గార్లు, కొత్తపల్లి.
౨౦ దంటు లక్ష్మీనరసింహముగారు - సుద్దపల్లి.
౨౧ మద్దూరు సాంబయ్యగారు - పొగాకుకంపెని - చిరుమూరు.
౨౨ కేశవరావు దేశముఖుగారు - నెల్లుట్ల
[illegible]ద్ద చంద్రయ్య, మారేపల్లి మారుతిరావు దేశముఖుగార్లు - కొత్తపల్లి.

---

## —◆ రివరెండు జె. టి. డేవిస్ గారు ◆—

పరంపరాగతముగ నాచరింపఁబడుచున్న యాచారములలోఁగల పవిత్రత్వము నెడల నీనాఁటి సంస్కర్తలు గొప్ప యనాదరణము దిరస్కారమును జూపినంత నేమాయె ? అట్టిసంస్కర్తలకే రేపో మాపో చేదుగా వెగటుగా నున్న దుష్ఫలితము లుదయించినప్పుడు తల తిరిగి రాకతప్పదు. ఈమహోపాయము నీనాఁటి సంస్కర్తలకుఁ జూపించి మందలించుటతో మాభాగ్యతను నెఱవేర్చినవార మగుచున్నాము.

